# స్వప్నహారము

## (కవితలు)

బెజవాడ గోపాలరెడ్డి

ప్రరోచన

డా॥ వి. వి. యల్. నరసింహారావు

# గ్రంథకర్త జీవన వివరాలు

| | | |
|---|---|---|
| జననము | — | 5 ఆగస్టు, 1907<br>బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.<br>తండ్రి - పట్టాభిరామిరెడ్డి<br>తల్లి - సీతమ్మ. |
| చదువు | — | బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు.<br>ఆంధ్ర జాతీయ కళాశాల<br>(1921-24).<br>విశ్వభారతి<br>(1924-27). |
| సమరపర్వము | — | సర్కారుబడి వదులుట జనవరి 1921.<br>జైలు శిక్షలు - ఆరు మారులు.<br>1930, 31, 32, 33 లోను,<br>1940, 41, 42, 43 లోను<br>కొంతభాగాల్లో జైలులో ఉండినారు. దాదాపు<br>4 సం॥లు జైలులో మకాం. ఎ బి సి క్లాసుల<br>ఖైదిగా, డెటిన్యూగా. |
| ఉద్యోగపర్వము | — | మంత్రిగా - మద్రాసు, కర్నూలు,<br>హైదరాబాదు, ఢిల్లీలలో - 186 మాసాలు<br>గవర్నరుగా - ఉత్తరప్రదేశ్‌లో 62 మాసాలు<br>ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్-<br>జూన్ 1951 నుండి 57 వరకు. |
| సాహిత్య పర్వము | — | తెలుగు భాషా సమితి అధ్యక్షులు - 1948 నుండి.<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - ఆగస్టు<br>1957 నుండి డిసెంబర్ 1982 వరకు.<br>కేంద్ర సాహిత్య అకాడమి<br>1978 జనవరి నుండి 82 డెసెంబరు వరకు,<br>రెండవతూరి- 83 జనవరి నుండి.<br>జ్ఞానపీఠము - 1963 నుండి 1971 వరకు. |

# బెజవాడ గోపాలరెడ్డి

## పుస్తకాలు

**వేయి సోయగములు**

'ఆమె' పంచకము

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె చెణుకులు (1982)
6. స్ఫులింగాలు-తుషారాలు (1984)
7. స్వప్నహారము (1986)

**శతకవితలు**

'కవితా' పంచకము

8. కాలవాహిని (1979)
9. సాహిత్య సుందరి (1980)
10. ప్రసూన మంజరి (1981)
11. పరిమళ తరంగాలు (1982)
12. సాగర సమీరాలు (1983)
13. మలయ మారుతాలు (1985)

**రానున్నవి**

ఇక్బాల్ ఫిర్యాదు-జవాబు

ఇతర కవితలు (ఉర్దూ నుండి)

**బెంగాలీ నుండి (రవీంద్రునివి)**

1. రవీంద్రుని నాటికలు (5 పుస్తకాల సంపుటి)
2. కథలు - కల్పనలు
3. వాన చినుకులు
4. ఊర్వశి - కాళిదాసు
5. నైవేద్యము-స్మరణ
6. తాజ్‌మహల్

# అంకితము

కీర్తిశేషులు, పండితులు, కవులు,

సన్నిహిత ఆప్తులు అయిన

శ్రీ దర్భా రామమూర్తిగారు

శ్రీ గుర్రం వేంకట సుబ్రహ్మణ్యంగారు

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు గారల

పుణ్యస్మృతికి

# నివేదన

నా సొంత కవితల పుస్తకాల వరుసలో ఇది పదమూడవది. దశాబ్దము క్రిందట అనుకోని గుప్త సంపద. ఊహించని చెలమ. ఊటలు జాలువారుచునే యున్నవి. నన్ను విస్మయపరచిన నిక్షేప సంపత్తి. ఆశించని సంపద కనుకనే విస్మయము, ఆనందము. నా శక్తికి మించినదే, కాబట్టి మరింత ఆనందము. నేను పండితుడను కాను శాస్త్రజ్ఞుడను కాను అని సదా ప్రకటించుకొనుచునే ఉన్నాను. అయినా కొన్ని పువ్వులు పూచినవి. కొంత రంగు, కొంత సువాసన అందు కనబడుచున్నవి. అవి చూడలేని వారిని వీటిని ముట్టుకోవద్దని వేడుచున్నాను. చూడగలిగిన వారు ఎవరో ఉన్నారులే అనే భవభూతి విశ్వాసము. అందుకే ప్రచురించుచున్నాను.

నా ముక్తకాల వరుసకు తొలుత పద్యకాలని, ఆమె పంచకమని పేరిడినాను. అవి ఐదు పుస్తకాలు కనుక. తర్వాత స్ఫులింగాలు-తుషారాలు ప్రచురించాను. ప్రస్తుతము వీచికలతో కూడిన స్వప్నహారమును ఆంధ్రులకు అందించుచున్నాను. ఈ ముక్తకాల వరసలో ఇది ఎనిమిదవది -కాని ఏడవ సంపుటము.

దీర్ఘ కవితలలో ఆరు ఇప్పటికే ప్రచురింపబడి ఉన్నవి. సౌరభనీరాజవాలు సంసిద్ధముగా ఉన్నది. త్వరలో ప్రచురించగలనని ఆశించుచున్నాను. నా కవితా చషకము రెండు వైపుల ఉబికి జాలువారినది. ముక్తకాలు, దీర్ఘ కవితలు. నన్ను అభిమానించు వారిలో కొందరికి ముక్తకాలు ఇష్టము; కొందరికి దీర్ఘ కవితలు - కొందరికి చంద్రుడు ఇష్టము, కొందరికి నక్షత్రాలు మాదిరిగా. స్వప్నహారములో మూడు భాగాలు : 1. స్వప్నమాల, 2. నేడు, 3. వీచికలు.

వీనిలో స్వప్నమాలను గూర్చి కొంత విశదీకరించవలసి ఉన్నది. నిద్రలో జనించినది స్వప్నము. రెంటిని వేరు వేరు విషయాలుగా తీసికొన్నాను. శాస్త్రరీత్యా కాక సాహిత్యపరంగా విశ్లేషించినాను. ఒకే విషయాన్ని వివిధ కోణాల నుండి చూచి వర్ణించటము ఉల్లేఖమంటారు ఆలంకారికులు. అందుననే స్వప్నమాలను ఉల్లేఖమంజరి అని కూడ అన్నాను. జంకుతోనే ప్రారంభించాను. ఏ ఇరువదో, ఇరువది ఏదో చేస్తామని తలచాను. విన్న స్నేహితులు యాభై వరకు చేయండని కొందరు, నూరు చేయండని, శతకము పూర్తి చేయమని

ప్రోత్సహించారు. ముఖ్యముగా డాక్టరు పప్పు వేణుగోపాలరావు గారు, మద్రాసులో విని, ఎక్కువగా ప్రోత్సహించారు. ధైర్యము వచ్చింది. సంఖ్యతో నిమిత్తము లేక వ్రాస్తామని నిశ్చయించుకొన్నాను. యాభైకి దాటాయి. నూరు చేయలేదు. 74 తో ఆగింది బండి.

ఒక సాహసమైన ప్రక్రియనే నేను ప్రారంభించాను. నాకు తెలిసి ఎవరు ఇన్ని ఉల్లేఖములను కలను గూర్చి వ్రాయలేదేమో! ఉల్లేఖములలో కవితా గుణము ఎక్కువ లేకపోవచ్చును. కాని అది ఒక చమత్కారము. శ్లేషవలెనే చమత్కారము. అవధాన కవిత్వమువలె చమత్కారము. చమత్కారము కూడా ఒక భాగమే జీవిత కావ్యములో. కవితా సుందరికీ అలంకారాలతో పాటు కొన్ని చమత్కారాలు, హాస్యాలు ఉండాలి గదా!

ఉల్లేఖము ఆంధ్రులకు అపరిచయ విషయము కాదు. సీస పద్యములో నాలుగు పాదాలలో నాలుగు రకములుగా వస్తువును పోల్చడము తరచుగా చూస్తుంటాము. సంస్కృత కాదంబరి నాకు అభిమాన కావ్యము. దాని ప్రభావ మేమో నాకు ఉల్లేఖములంటే అభిమానము. నా తొలి కవితా శీర్షిక తాజ్ మహల్‌లో తాజ్‌మహల్‌ను అనేక విధములుగా పోల్చుకొన్నాను. నేను కాలమును గూర్చి వ్రాసేటప్పుడు, నేడు అనే శీర్షికను ఉల్లేఖములతోనే నింపి వేసినాను. అందుకనే, కాలవాహిని పుస్తకములో ప్రచురింపబడిన నేడును స్వప్నమాల ప్రక్కనే తిరుగ ముద్రించుచున్నాను. నా సాహిత్య సమీక్ష నేను చేస్తున్నప్పుడు చాలచోట్ల ఉల్లేఖాలంకారము కనబడుచునే యున్నది. పరిమళ తరంగాలు అనే కావ్యములో, తెల్లమబ్బులు అనే కవితలో అనేక రకాలుగా ఊహించాను. అది ఒక దృష్టాంతముగా ఉదహరించుచున్నాను.

'నేడు'ను 33 ఉపమానాలతో వర్ణించాను. కొంత ఓపికతో చదువవలయు నని విన్నపము. ఉల్లేఖములో చమత్కారము ఉన్నటులే కొంత విసుగును పుట్టింపవచ్చును. సంగీతములో రాగాలాపనలోను, స్వర విస్తరణలోను అట్టి ప్రమాదము లేదా? దమయంతిని నఖశిఖ పర్యంతము వర్ణించునపుడు అట్టి భావము కలుగదా! విందు భోజనములలోను కూరలో పిండివంటలో ఎక్కువైనపుడును అదేస్థితి. పెండ్లిలో మంత్రాలు ఎక్కువైనపుడు, ఉపన్యాసము దీర్ఘమైనపుడు అంతే. బోర్ కొట్టుచున్నదంటారు విద్యార్థులు. పుస్తకములో ఒకే సారిగ చదువనక్కరలేదు. మరొకసారి చదువవచ్చుగదా! చమత్కారములోని సొంపును ఆనందించే వారే ఒకేసారిగ చదువవచ్చును ఉల్లేఖము అపరాధము కాదనే నా సంజాయిషి.

స్వప్నమాలను, 'నేడు'ను కొంత అభిమానముతోనే, ఓర్పుతోనే చదవాలె. స్ఫులింగాలు - తుషారాలవలెనే పీఠికలు. మొత్తముమీద 15 లేక 16

వందల ముక్తకాలను వ్రాసి, సమర్పించినానని విన్నపము. ఇందులో కొన్నైనా బాగుంటే సంతోషము. కొన్నైనా చమత్కారముగనో, హాస్యభరితముగానో ఉంటే సంతోషము-నేనెవరిని విమర్శింపలేదు, అపహాస్యము చేయలేదు. నాది నిరసన సాహిత్యము కాదు.

నా స్వప్నమాలను విని సంతోషించిన పెద్దలు చాలమంది. అందులో నెల్లూరులో వాణిజ్యపన్నుల డిప్యూటి కమీషనరు శ్రీ అమ్మలయ్యగారు రెండు మూడు తడవులు స్వప్నమాలను నా వద్ద, స్నేహితులవద్ద ప్రశంసించారు. వారు నా కావ్యముల శ్రద్ధగ చదివినవారు. అట్లనే నెల్లూరు అడ్వకేటు శ్రీ గుర్రం వేంకట సుబ్రహ్మణ్యంగారు, వారు ఆరోగ్యముగా ఉన్నపుడు, విని ప్రశంసించి ప్రోత్సహించారు. అనలానికి అనిలము సాయపడినటుల, కళకు కొంత ప్రోత్సాహము అవసరమే. కళాసుందరి రసజ్ఞుల సమ్ముఖముననే నాట్యము చేయగలదు.

స్ఫులింగాలు - తుషారముల వలెనే, వీచికలు అనేక విషయాలపై వ్రాయబడినవి. మలయ మారుతాలలో 26 చేర్చినాను. వీటితోనహా, వీచికలను ఇందు చేర్చినాను. ముక్తకాలను ఇన్ని వ్రాయడము సాహసమైన కార్యమే.

డాక్టరు వి. వి. యల్. నరసింహారావుగారు అంగీకరించి పరిచయ వాక్యాలు వ్రాసినందులకు వారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు. వారు పండితులు, మంచివక్త. ప్రస్తుతము 'ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ ఇన్‌స్టిట్యూట్' డైరక్టరుగా వ్యవహరించు చున్నారు.

ముద్రణలో సహకరించినవారు, ముఖ్యముగా శ్రీ యార్లగడ్డ ఆంజనే యులు, తెలుగు భాషానమితి వ్యవహర్త గారికి వందనములు,

సౌరభ నీరాజనాలు త్వరలో ముద్రింపగలను. 77 వ సం॥లో మే నెలలో ప్రారంభమైన నా కవితా స్రవంతి పదునాలుగు పుస్తకాలుగా 86 డిసం బరుకు ముద్రణ పూర్తిచేస్తే, వినమ్ర ఆనందముతో, సాధించిన కార్యానికి పరితుష్టితో వేరొక ఆనందాన్ని అన్వేషించుకోవచ్చును.

బెజవాడ గోపాలరెడ్డి

మకాం : రాజా అణ్ణామలైపురం
మద్రాసు.
6/5/1986.

# ప్రరోచన

'నేను కవితా సభలోకి చాల ఆలస్యంగా వచ్చా'నన్నారు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు తమ జీవితంలోని ముఖ్యఘట్టాలు వివరిస్తూ. అదీ కవితాభాష లోనే చెప్పారు—కవి కనుక. అర్థమేమంటే—'నాకు డెబ్భైయేళ్ళు నిండు తున్నప్పుడు కవితారచన మొదలుపెట్టా' నని.

కవులైనవారు చాలమంది పడుచుప్రాయంలోనే కవితారచన ప్రారంభిం చారు. అందువల్ల వారి కవితల్లో కొన్నితావుల కసుగాయల పసరువాసన తప్పలేదు. షష్టిపూర్తి దాటిన పదేళ్ళకు కవితారచన ప్రారంభించిన ప్రోఢ శ్రీ గోపాలరెడ్డిగారొక్కరేనేమో! అందుకే కాబోలు వారి కవితలో డెభ్భైయేళ్ళ ఆరముగ్గిన అనుభవాల పక్వ ఫలవాసనలు గుబాళిస్తున్నాయి.

రెడ్డిగారి జీవితం పర్వపంచకంగా విభజించ తగివుంది. జననం 1907లో కనుక ఆ కాలాన్ని సంభవపర్వ మనుకుంటే అప్పటినుంచీ 1927 వరకుగల కాలాన్ని శిక్షాపర్వ మనుకోవచ్చు. ఆంధ్రజాతీయ కళాశాలలోను, విశ్వభారతిలోను ఆయన శిక్షణ నందుకున్నకాలం అందులోకి వస్తుంది. తరువాతి 22 సంవత్సరాలు స్వాతంత్ర్య సమరపర్వంగా చెప్పవచ్చు. ఆటు తర్వాత 1957 వరకు మంత్రిగా, గవర్నరుగా, విశ్వవిద్యాలయం ప్రోఛాన్సు లర్‌గా ఉద్యోగపర్వం నడిచింది. ప్రస్తుతం నడుస్తున్నది సాహిత్యపర్వం. రాష్ట్ర-కేంద్ర-సాహిత్య అకాడమీలతోను, జ్ఞానపీఠంతోను రెడ్డిగారి కేర్పడ్డ అనుబంధం ఈ పర్వంలో అంతర్భాగమేనని వేరే చెప్పనక్కర్లేదు.

ఎంతో వైవిధ్యంతో కూడిన రెడ్డిగారి అనుభవాలు పండించిన సాహి త్యపు పంటలే ప్రస్తుతం వారు వ్రాస్తున్న గ్రంథాలు. విశ్వభారతిలో చేసిన శుశ్రూషవల్ల రెడ్డిగారిపై ప్రసరించిన రవీంద్రుని మహోన్నత వ్యక్తిత్వం, సంగీత సాహిత్యాల ప్రభావం వారి రచనలను తీర్చి దిద్దాయనవచ్చు.

వంగభాష నుండి అనువదించిన రవీంద్రుని నాటికల సంపుటులు, కథలు, 'వాన చినుకులు', 'ఊర్వశి', 'నైవేద్యం', 'తాజ్‌మహల్' వంటి రచ

నలు విశ్వభారతి సేవాఫలాలే. ఈ దశ గడచి రెడ్డిగారు స్వచ్ఛంద స్వీయ కవితలుగా వెలువరించిన ఇటీవలి రచనలు వేయిసోయగాల కవితాసుందరిని సాక్షాత్కరింప జేశాయి. 'ఆమె జాడలు', 'నీడలు', 'తళుకులు', 'చెణుకులు' ఒక వంక 'స్ఫులింగాలు'గా మరొక వంక 'తుషారాలు'గా తెలుగువారి తలపుల్లో ద్వంద్వ భావ సమాహారాన్ని సృష్టించాయి. శతకవితలుగా విరిసిన 'సాహిత్య సుందరి' 'కాలవాహిని'గా జాలువారి, ప్రసూనమంజరుల 'పరిమళ తరంగాలు' రేపి, 'సాగరసమీరాల'తో కలిసి సహృదయ హృదయాల్లో 'మలయమారుతాల' చల్లందనాలు నింపిన మాట నిజం.

## II

చిత్రమేమంటే— ఇంతా చేసి రెడ్డిగారు "తెలుగు సాహిత్య మర్యాదలు నాకు బాగా తెలియ"వంటారు. ఆ మాట నిజమే అయితే ఆ తెలియకపోవటం కూడా ఆయన రచనలకు ఒక నూతనత్వం ఆపాదించిందంటాను. మర్యాదలు బాగా తెలుసుననుకున్నవాళ్ళు ఛాందసులై గతానుగతికుల కోవలో కలిసి పోయారు. తెలిసి తెలిసి పరిత్యజించినవాళ్ళూ, తెలియదనుకొని దాని జోలికి పోనివాళ్ళూ కవిత్వానికి కొత్తదారులు పరచి చూపించారు.

తెలుగు కవితా రంగంలో నేడు బహుళ ప్రజాదరణ పొందుతున్నది వచన కవితా ప్రక్రియ. ఒక రకంగా ఈ ప్రక్రియ రవీంద్రుని గీతాంజలి ఆంగ్లానువాదంతోనే- దాదాపు ముప్పావు శతాబ్ది క్రిందటే- అంతర్జాతీయ స్థాయిలో, ప్రచారం పొందింది. సూక్తి మాధుర్యంతో ముక్తకవచనాలుగా, 'మ్యూజింగ్స్'గా ఈ వచన కవితలు అనేక భాషల్లో వ్యాప్తి పొందాయి. తెలుగులో వీటికి నేడు పట్టాభిషేకం జరుగుతున్నది. కొన్ని ముక్తక వచ నాలనూ, మ్యూజింగ్స్‌నూ పాదాలుగా విరిచి నిలబెడితే నిక్షేపం లాంటి వచన కవితలై కూర్చుంటాయి. ఛందస్సర్పాల ఫూత్కారాలుగాని, యతిప్రాసల గిరవాట్లుగాని లేకుండా హాయిగా చెప్పదలచుకున్నది చెప్పటానికి అవకాశ మిచ్చేది వచన కవితేనని అధిక సంఖ్యాకు లంగీకరిస్తున్నారు; అట్లా వ్రాస్తు న్నారు; ఆదరణ పొందుతున్నారు.

నిజానికి వచన కవిత వ్రాసి మెప్పించటం అనుకున్నంత తేలికకాదు. ఛందో రూపమైన తాళలయలుగాని, శబ్దాలంకార రూపమైన యమకాను

## 11

ప్రాసలుగాని ఇతరమైన ఏ బాహ్యాడంబరాలుగాని లేకుండా కేవల భావనా బలంతో కవిత వ్రాసి మెప్పించటం గొప్ప విషయమే. ఈ జాతి కవితలో అనుభవాల అభివ్యక్తులు, సందేశాల చోదక శక్తులు రక్తిముక్తుల రాచబాటలు. ఊహలుగాని ఈహలు, స్తవాలు గాని వాస్తవాలు, కల్లలుగాని కలలు ఈ కోవకు చెందిన కవితకు ప్రేరకదీప్తులు.

ఇటువంటి నేపథ్యం నుండి పొటమరించిన రెడ్డిగారి కవితలు ఒకవైపు 'ఉల్లేఖ మంజరులు'గా ఇంకొకవైపు ఉత్తుంగ 'వీచికలు'గా కదలియాడటం సహజమే. ఒక వంక సురభిళ 'స్వప్నమాలలు'గా, ఇంకొక వంక సురుచిర 'స్వప్నహారములు'గా రసికుల కనురెప్పలపై తేలియాడి అటు బుద్ధిగుహను ఇటు హృదయకుహరాన్ని జ్యోతిర్మయం చెయ్యటమూ సహజమే.

## III

కవిత్వం గూర్చి, పాండిత్యం గూర్చి ఈ కవికి నిశ్చితమైన అభిప్రాయా లున్నాయి. "కవిత్వం అధ్యయనం కోసమే, అనుభవించటం కోసం కాదు" అంటా రీయన. అటువంటి కవిత రసానందం కంటె శాస్త్రానందాన్నే ఎక్కు వగా అందిస్తుందేమో! "ఇంతకూ కవి వ్రాసేది ఎవరి కోసం? ఆత్మానందం కోసమా? సమకాలీనుల కోసమా? ఆధునికుల కోసమా? శాస్త్ర పూజారుల కోసమా?" ఈ ప్రశ్న పరంపర కవిగారిదే. ఉత్తరోత్తరం బలీయం. పట్టణం సందుల్లో జనం మధ్యలోనే వున్నా కవి తన ఏకాంత కనకమహల్లోనే నివ సిస్తాడు. కవితా ప్రయోజనాన్ని నిరూపించగలిగేది అనంతమైన కాలం.

"కవితా ఫలం పుట్టేది సాహితీ తరువుకు; అది మాగి భక్ష్యయోగ్యం కావటానికి కొంత కాలం పడుతుంది"

సామాన్య కవుల కవితా సుందరి సహృదయ పాఠకుల్ని అభిసరిస్తూ బయలుదేరుతుందట. కాని మహాకవుల కవితా సుందరి విశ్వాన్ని అభిసరిస్తూ వెళుతుందట. వారికి వీరికి బట్టుకవికీ భవభూతికీ ఉన్నంత భేదం.

కవితలో వాస్తవిత కన్నా బుద్ధికన్నా, కల్పనే మెండుగా వుండాలి. ఊహల తుషారంలో కనిపించే అందం కవితానందానికి మూలకందం. కవి 'కెమెరా మెన్' కాడు, చిత్రకారుడూ కాడు. అగోచరమైన ఊహను అందంగా

పదాల్లో పొదివే నేర్పరి. అందువల్లనే కవి మానవ ప్రవృత్తులకు దర్పణం కాక, తాను సృష్టించే ఊహలకూ కల్పించే భ్రమల సంకేతలకూ మాత్రమే దర్పణ మౌతున్నా'డంటారు రెడ్డిగారు.

'నగ్నంగా విహరిస్తున్న చీకటిని కవి అగ్గిపుల్ల వెలుగు ఆందోళన పరుస్తుంది. ఆంతర రహస్యాలను వెలికి లాగుతుంది. చీకటి యేనుగులకు చిన్న వెలుగు కొరడా అవుతుంది.'

సారహీనమైన స్థూలజగత్తు కంటే సారభూతమైన సూక్ష్మజగత్తు ఎట్లా గొప్పదో సంకేతితమైన ఊహ ద్వారా కవి అద్దంలో చూపినట్లు చూపగలిగాడు. ఇక్కడ కవి తాను మానవ ప్రవృత్తికి దర్పణప్రాయం కాక కల్పిత సంకే తాలకు దర్పణం కావటం గుర్తించదగిన అంశం. దీన్నే సాంప్రదాయికమైన ఆలంకారిక పరిభాషలోనూ చెప్పవచ్చు. విషయంలో భేదం ఉండదు.

విశాల విశ్వపరిష్వంగం కోరే కవిని పల్లెలోనో వాడలోనో కట్టిపడవేస్తే ఎదురు తిరుగుతాడు. మహాకావ్యంలోని మహాస్రగ్ధరలా దీర్ఘపాదాలు తన్నిపట్టి నిలిచిన కవిని భావకవితలో తేటగీతిలా ముడుచుకు కూర్చోమంటే కూర్చుం టాడా ? విశ్వభారతిని వలచిన కవితా స్రష్టను కేవలం నెల్లూరి పౌరుణ్ణిగా చూడటం చూచేవాడి తప్పు.

సహస్ర సహస్రాబ్దాల మానవోదయాన్ని చూడదలచిన ద్రష్టకు వారమో మాసమో గడువుపెట్టి చూడమంటే మనశ్శరీరాలు బిగుసుకుపోవూ? మనశ్శరీరాలకు పూర్ణ స్వేచ్ఛనిచ్చిన రెడ్డిగారి చూపు అసామాన్యమై ప్రాకింది.

సామాన్యులచూపు భూతకాలంనుండీ వర్తమానంద్వారా భవిష్యత్కాలం లోకి ప్రయాణిస్తుంది. త్రికాలజ్ఞుడైన భావుకుని చూపు భవిష్యత్తులోంచి వర్తమానం ద్వారా భూతకాలంలోకి ప్రవేశించటమూ కద్దు. ప్రస్తుత కవికి వర్తమానం అట్లాగే దర్శనమిచ్చింది చూడండి.

''భవిష్యత్కాల వల్మీకం నుండి
భూతకాల వల్మీకంలోకి పొయ్యే
కుబుసం విడిచిన శ్వేతనాగం 'నేడు'.''

ప్రళయకాలంలో సృష్టిసంహారానికి విరాట్స్వరూపుడై వెడలే యమ ధర్మరాజు భుజాన వ్రేలాడే యజ్ఞోపవీతంలా కనిపించింది కవిగారికి 'నేడు'. పురా ప్రకృతికి స్వస్తిచెప్పి, పునఃసృష్టికి నాందిపలికే నూతన వైదికధర్మానికి ప్రతీక కాదుకదా కాలయముని గాయత్రీసూత్రం?

వర్తమానాన్ని ఈ దృక్కోణంనుండి దర్శించిన కవి ఈయనొక్కడే నేమో! వీరిదృష్టికి వర్తమానం విశిష్టంగా కనిపించింది.

## IV

అనుభవ పరిపాకంతో, ఉక్తి చమత్కారంతో జీవితాన్ని సమీక్షిస్తూ వ్యాఖ్యానిస్తూ వెలయించే వచనకవితలు ఈ రచనలో ప్రాధాన్యం వహిస్తాయి. పరిమిత పదాల్లో బృహత్కథను పొదిగే శక్తికూడా ఇందులో భాగమే. జీవితం, ప్రేమ, పదవి, అందం, ప్రభుత్వం, కోర్టులు, కళలు మొదలైన అన్నిటి సమీక్షా ఇక్కడ కవితావస్తువే.

జీవితానికి సుఖ దుఃఖాలు రెండూ అవసరమే. దుఃఖం లేకపోతే సుఖం రుచి తెలియదు. అందుకే అన్నాడు కవి-

''జీవన దీపానికి దుఃఖాలు చమురు, సుఖాలు వత్తి,
ఏది లేకున్నా దీపం వెలగదు.''

''కర్పూర వసంతరాయలు ప్రేమప్రపంచంలో పెద్దప్రభువు.
భార్యను ఏడిపించాడు, దాసికోసం ఏడ్చాడు''

ఏడిపించినవాడు ఎప్పటికైనా ఏడవక తప్పదు.
ఆధునిక కవిని హఠాత్తుగా ప్రశ్నిస్తే వచ్చే జవాబు వింతగానే ఉంటుంది.

''ఏమండీ ఏమైనా రాస్తున్నారా?''

''ఆ .. ....రాస్తున్నా....... రొట్టెకు వెన్న... డబ్బుంటే,
లేకుంటే....... ప్రోనోట్లు రాస్తున్నా,
తీరికవుంటే కథలు రాస్తున్నా,
లేకపోతే ప్రేమగేయాలు .......
మా ఆవిడ మాత్రం కంటికి కాటుక, నెత్తికి నూనె రాస్తుంటుంది''

సొంత కాళ్ల మీద నడవలేని ఆధునిక యుగాన్ని అందంగా అభిశంసించాడు కవి.

''అతడు నా భుజాలెక్కి
అందరి చేతా పని చేయించుకోవా లంటాడు;
సిఫారసులకు నన్ను తోడ్పడ మంటాడు;
సొంతకాళ్ళమీద నడవలేని యుగమిది....''

కాళ్ళు కదలక పోతే రెక్కలుగట్టుకొని స్వప్న విహాయసంలోకి ఎగిరిపోయి నూతన స్వర్ణయుగాన్ని సంభావించాలి. కవి చేసిందీ అదే.

## V

విలువలు మారిన యుగంలో ఏది సమ్మానమో ఏది అవమానమో తెలియకుండా పోయింది.

''అతడు లంచం పుచ్చుకోడు, అబద్ధాలు చెప్పడు,
అందుకోసమే అతన్ని సమ్మానించాలి.
'ఆమె వ్యభిచారిణి కాదు'
అని ఉత్సవంకూడా చేస్తారేమో!''

ఉన్నవాడెప్పుడూ ఉన్నవాడికే సాయపడతాడు. లేనివాడికి సాయపడుతున్నట్లు మాటల్లో అభినయిస్తాడు. ఎట్లాగంటే .......

''కరువు కాలాలలో
మబ్బులు వర్షవాగ్దానాలు చేస్తూ పోతాయి,
మెరుపులు చూపిస్తాయి, ఉరుములు వినిపిస్తాయి, తుంపరలు చల్లుతాయి,
వానమాత్రం సముద్రం మీదే ! ! !

ఇది సజాతీయమైన అభిమానానికి కూడా ఒక నిదర్శనం.

ఇక మన మాతృభాషాభిమానం మరీ విచిత్రం.
ఇంగ్లండులోఉన్న తెలుగు విద్వాంసు డంటాడు....

''నేను చదివేది ఇంగ్లీషు
మాట్లాడేది ఇంగ్లీషు
వ్రాసేది ఇంగ్లీషు
కలలు తెలుగులోనే సుమా!''

ఇది ఇంగ్లండులోని విద్వాంసుడి పరిస్థితి మాత్రమే కాదు;
తెలుగుదేశంలోని తెలుగు విద్వాంసుడి స్థితికూడాను.

కల అనేది మనల్ని అడిగి వచ్చేదికాదు, దానిమీద మనకు అదుపు లేదు. అది రాదల్చుకున్న భాషలోనే వస్తుంది.

''నిద్రాయవనికమీద మనశ్చిత్రకారుడు స్వప్నాల చిత్తరువులు గీస్తాడు''.

నిరభ్ర నిద్రాగగనంలో కాన్పించే ఇంద్రధనుస్సు స్వప్నం. "నిద్రాభంగం కానీకుండ స్వప్నసరస్వతి అంతర్వాహినియై మెలకువతో ప్రవహిస్తుం"దట.

## VI

ఈ కవితా సంపుటిపేరు "స్వప్నహారం". కవితానుభూతికీ స్వప్నానుభూతికీ ఏదో పోరాని సంబంధం వుంది. స్వప్న సరస్వతి లక్షణం అన్వేషించ తగిందే.

స్వప్నావస్థలో పంచేంద్రియాలు విశ్రాంతి పొందుతున్నాయి. జాగ్రదవస్థలో పొందిన అనుభూతులూ సంస్కారాలూ స్వప్నావస్థలో విలక్షణంగా మేలుకొంటున్నాయి. జాగ్రద్వ్యవహారం లోపించటంవల్ల నాడీప్రచలితమైన ఒకానొక తేజస్సుతో, వాసనారూపమైన జగద్వైచిత్ర్యం భావిస్తూ జీవుడు తనకు తానుగా పొందే అనుభవం స్వప్నం. జీవుడు విశ్వాంశ కనుక స్వప్నానుభవం కూడా విశ్వాత్ముడే పొందుతున్నట్లు మన ఉపనిషత్తుల భావన. పైంగలోపనిషత్తు స్వప్న లక్షణాన్ని అట్లాగే వ్యాఖ్యానించింది.[1]

"కరణో పరమే జాగ్రత్సంస్కారార్థ ప్రబోధవతీ గ్రాహ్యగ్రాహక రూప స్ఫురణం స్వప్నావస్థా భవతి.

తత్ర విశ్వ ఏవ జాగ్రత్ వ్యవహారలోపాత్
నాడీచరం తైజసత్వ మవాప్య
వాసనా రూపకం జగద్వైచిత్ర్యం స్వభాసాభాసయన్
యథేప్సితం స్వయం భుంక్తే. (పైంగలోపనిషత్-ద్వితీయాధ్యాయం)

గట్టిగా మాట్లాడితే వ్యావహారిక జగత్తు సర్వం స్వప్నజగత్తువంటిదే. వేదాంతులు పారమార్థికమైన సత్యం వ్యవహారజగత్తుకు అతీతమైందనే చెబుతారు.

ఈ భావాన్ని ధ్వనింపజేస్తూ శ్రీ రెడ్డిగారు కూడా స్వప్నాన్ని మనోహరంగా వ్యాఖ్యానించారు.

"నిద్రలో కలలు కంటాం,
దీర్ఘనిద్రలోకూడా కల లున్నాయా?
చావులో బ్రతుకే కల అంటారు వేదాంతులు, మాయావాదులు;
కల తుదికాగా, బ్రతుకు చావులో నిద్రిస్తుంది."

---

1. ఈ అంశాలను "స్వప్నశిల్పం - ధ్వని" అనే తమ వ్యాసంతో డా. జి వి. కృష్ణారావుగారు గుర్తించారు.

ఇంతకూ జాగ్రదవస్థకూ స్వప్నావస్థకూ వున్న కార్య కారణభావం అవశ్యం గుర్తించతగింది. దీన్ని స్పష్టంగా గుర్తించి, చక్కగా వివరించినవాడు సిగ్మండ్ ఫ్రాయిడ్. యంగ్, ఎడ్లర్ వంటివారు విశేషాలు వివరించినా ప్రథమ తాంబూలం ఫ్రాయిడ్‌దే. జాగ్రదవస్థకూ సుషుప్త్యవస్థకూ నడుమ స్వప్నావస్థ అనేది ఒకటుంది. జాగ్రదవస్థలో సిద్ధిపొందని వాంఛలు స్వప్నావస్థలో విహరించటం కద్దు.

స్వప్నానికి నాయకుడు స్వప్నంపొందిన వ్యక్తి. అంటే స్వప్నానుభూతి కలగన్న వానికి సంబంధించి వుంటుంది. కావ్యానుభూతి సహృదయుడైన సామాజికునకు సంబంధించి వుంటుంది.

'స్వప్నహారం' కావ్యకర్త శ్రీ రెడ్డిగారు స్వప్నానుభూతులుగా వ్యక్తం చేసిన భావాలు కొన్ని లోకంలో జాగ్రదవస్థలో సిద్ధి పొందనివి, కొన్ని పొందినవి. వాటిని స్వప్నమాలలుగా అల్లి, వాడని వాసనలు వీడని స్వప్నహారం చేసి, ఉపహారంగా సామాజికుల కందించారు రెడ్డిగారు. నిద్రలో స్వప్నం ఎన్ని సోయగాలు కుప్పవోస్తుందో అద్భుతంగా ఉల్లేఖించారు.

అన్నట్లు ఈ 'స్వప్నమాల' అక్షరాలా ఒక 'ఉల్లేఖ మంజరి' - అర్థాలంకారమైన ఉల్లేఖాన్ని ఇంత అర్థవంతంగా స్వప్నజగద్వర్ణనకు వినియోగించిన వచనకవి రెడ్డిగారొక్కరే. వీరి ఉల్లేఖం వింత వింత సొంత అనుభవాల రంగుల రెక్కలు తొడుక్కుని, కవితా విహాయసంలోకి రివ్వున ఎగిరిన రాజహంస.

ఆ రాజహంసకు నా ఈ 'ప్రరోచన' కూడా ఒక ఉల్లేఖమే.

"నిద్రా మానస సరస్సులో<br>
సువర్ణ కమల మృణాళములు మెసవుతూ<br>
ఈదులాడే రాజహంస స్వప్నం"

అది శ్రీ రెడ్డిగారి కవితారాజహంస. సహృదయ మానస సరస్సులో సతతం విహరిస్తూనే వుంటుంది. ఆదర్శ స్వప్న జగత్తును సత్యజగత్తుగా మార్చేందుకు పరమహంసలా తపిస్తుంది.

హైదరాబాద్ — వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు<br>
15.1.86

# స్వప్నమాల
## (ఉల్లేఖ మంజరి)

1

నిద్ర నందన వనాన
స్వప్నము వసంతసౌరభమై వచ్చింది
కొంతసేపు గుభాళించింది.

2

నిద్ర ప్రేమికుడై వింటున్నాడు
స్వప్నము ప్రేయసియై మాట్లాడుచున్నది.

3

నిశీథ తిమిరాలు సుషుప్తి కాగా
శుక్లచంద్రుడు స్వప్నమువలె విహరించాడు.

4

నిద్రాలతకు
పుష్పించింది స్వప్నప్రసూనము.

5

బడలిన శరీరాన్ని కప్పింది నిద్ర
మెదడు కూర్చుని చూస్తున్నది కలల.

6

నిద్రా కాసారములో
సంకుచిత తరంగాలపై
ఊగుచున్నది స్వప్న కమలము.

7

గంభీరచర్చ జరిగేవేళ
సుషుప్తిసభనుండి, వాకౌట్ వలె
లేచిపోయింది స్వప్నము
త్వరలోనే తిరిగివచ్చింది.

8

నిద్రా మేఘమండలమున
మెరుపువలె మెరిసింది కల
రొదలతో ఉరిమింది కొంతసేపు.

9

నిద్రావీథులలో
వెలుగుచున్నవి
స్వప్నోత్సవ దీపాలు.

## 10

నిద్రా నిశ్శబ్ద దరులలో
ధ్వనించింది కలల కొండవాగు.

## 11

నిద్రా వేదికపై
కలల కాళ్లగజ్జెలు
గుసగుసలాడాయి.

## 12

ఒడలు నిద్రఒడిలో ఒదిగింది
నిద్ర కలలదుప్పటి కప్పింది.

## 13

నిద్రాయవనిక మీద
మనః చిత్రకారుడు
స్వప్నాల చిత్తరువుల గీసాడు.

## 14

నిద్రావిపంచి
స్వప్నవనాల్లో మీటింది
సప్తస్వరాలతో పాడింది
సౌందర్యశిఖరాల మెరిసింది
ప్రేమాలాపనలో పారవశ్యము చెందింది.

## 15

నిద్రా పారిజాత తరువు
వేకువన స్వప్నపుష్పాల రాల్చింది
శుక్రతారార్చనకై.

## 16

నిద్రా కబరీబంధములో
స్వప్తసిక్త సుమముల తురిమింది రజని
గుభాళించి మాయమైనాయి.

## 17

నిద్రావనిలో
స్వప్నము విహారవినోదినియై వెడలింది.

## 18

నిద్ర మైమరచి పరుండి యుండ
స్వప్నము అభిసారికయై
వచ్చి తట్టి లేపింది.

## 19

నిద్రా యమునా సైకతాల
స్వప్న వంశీధరుని
మోహన రాగము వినవచ్చింది.

**20**

నిద్రా నిషేధాజ్ఞల ధిక్కరిస్తూ
లోన ప్రవేశించింది స్వప్ననటి.

**21**

శాంత సుషుప్తి సాగరములో
ఎగిరిన ఉత్తుంగ తరంగము
స్వప్నము.

**22**

నిరభ్ర నిద్రాగగనములో
కాన్పించే ఇంద్రధనుస్సు స్వప్నము.

**23**

సాంద్ర సుషుప్తి పులినములలో
వాంఛా పదచిహ్నాలు స్వప్నాలు.

**24**

స్నిగ్ధ నిద్రా కపోలాలపై
కదలాడే అలకలవీచి స్వప్నము.

**25**

ముఖానికి సిందూరమువలె
ఉన్నది కల నిదురకు.

**26**

నిద్ర ముఖారవిందముపై
గుంజన చేసే భ్రమరము స్వప్నము.

**27**

నిద్రా గహన అరణ్యములో
మలయ మారుత వీచికయై
వీచింది స్వప్నము.

**28**

నిదుర గుండెను అలరించేవి
తియ్యని కలలు
మరుభూమిలో సంధ్యా సమీరాలవలె.
బాధించేవి పీడకలలు
ఝుంఝూ ప్రభంజనాల వలె.

**29**

వ్రజవిహారి నిదురించుచుండ
మృదు మంద పదములతో వెడలే
గోపిక స్వప్నము.

30

నిద్రాగృహమునకు విచ్చేసిన
అనుమతిపొందని యాత్రికుడు స్వప్నము.

31

నిద్రా శయన మందిరమున
తొంగి చూచే ధూర్తుడు స్వప్నము.

32

సుషుప్తి రహస్యాలను
హరించే గూఢచారి స్వప్నము.

33

వద్దంటే వస్తాడు
ఉండమంటే ఉండడు
దూకి వచ్చే జారుడు స్వప్నము.

34

నిద్ర నిద్రిస్తుంటే
కవ్విస్తుంటుంది కల.

35

నిద్రకు అర్థముకాని
పరభాషలో మాట్లాడే వగలాడి కల.

36

నిద్రా తిమిర ద్వారాల ద్వార
ప్రవేశము స్వప్ననగరములో.

37

వాస్తవిక జగత్తుకు దూరంగ
ఊహించని వినువీథులలో
వివిధ రూపాలతో విహరిస్తుంది కల.

38

సుషుప్తి తరంగాలు గెంటుచుండ
వేకువగట్టుల లంగరు వేయలేకున్నది
స్వప్న నౌక.

39

నిదురగుడిలో
మేల్కొలుపు పాటలు పాడాడు
కలల పాటగాడు.

40

నిద్రాభంగము కానీయక
మెలకువతో ప్రవహించుచున్నది
స్వప్నసరస్వతి అంతర్వాహినియై.

41

శిలారూపమున సుషుప్తి చెందిన
ఆహల్యాభావములు
స్వప్నరూప ధారిణులై
ఎచ్చటెచ్చటనో క్రుమ్మరించినవి.

42

నిద్రా మాంత్రిక
కన్పరచే ఇంద్రజాలము
స్వప్నశ్రేణులు
మనోహరముగ కాన్పించి, పంచబంగాళ మగుతాయి.

43

సుషుప్తి నీలక్షితిజాల
క్రమ్మివేసింది స్వప్నతుషారము,
వేకువ వెలుగులతో తొలగిపోయింది.

44

సుషుప్తి ప్రాంగణములో
చిత్రించిన శబల రంగవల్లి స్వప్నము.

45

నిద్ర వరదలు పొర్లకుండ
కట్టిన సేతువులు కలలు.

46

నిద్రావధూటికి వద్దన్నా
తొడిగిన ఆభరణాలు స్వప్నాలు.

47

నిద్రాధరములపై
నర్తిల్లే మందస్మితరేఖ స్వప్నము.

48

నిద్రామావాస్యకు
నక్షత్ర మండితాంబరము స్వప్నము.

49

సుషుప్తి ముకుళాయమానమై
దాచింది సురభిళ స్వప్నాల
వికసించి గుభాళించింది
రజనిని విహ్వాల పరచింది.

**50**

నిద్రా తమాల తరువులో
పూర్ణిమ అమావాస్యల మేళవించి చూపే
జ్యోతిరింగణము స్వప్నము.

**51**

నిదుర ఒరలో
పొంచియున్న కత్తి, కల.

**52**

జీవితములోని వేదన
నిదురలో కలగా
రూపాంతరము పొందింది.

**53**

నిదుర గుండెను అదుముచు
లేచి అట్టహాసము చేసింది
పీడకల.

**54**

విపరీత వేళలలో
హోమాగ్నులే చితానలము లైనటుల
రక్షకులే హంతకులైనటుల
జందెములే ఉరిత్రాడులైనటుల
శాంతి నొసగవలసిన నిద్ర
పీడకలల కలతల ఎగచిమ్మింది.

## 55

దివా దీప్తులచే దిక్కు తెలియక అణగి,
నిశాత మనస్సులలో చెలరేగి
నిద్రావల్మీకము నుండి బయలువెడలిన
ఉరగమువలె వంకరటింకరగ
సాగుచున్నది స్వప్నము.

## 56

నిద్రాంకములో పరుండియుండ
స్వప్నముల చూచే స్వర్ణావకాశము
మానవులకే గదా!
అనిమేషులు నిద్రకే నోచుకోలేదు
చిన్నతనమునుండి ముసలితనమువరకు
ఎండను నీడవలె
నిద్రనే పందిరి చేసుకొని
అల్లుకొంటుంది కల, మానవులను.

## 57

నిద్రా నందనోద్యానములో
విహరించే జవ్వని
చేలాంచల కదలికలా స్వప్నాలు ?
గాజుల గలగలలా.

## 58

మధువు
ద్రాక్షదుహితయైతే
స్వప్నము
నిద్ర దుహిత యగుతుంది.

9-1-85, 4-2-85
ఢిల్లీ, నెల్లూరు, మద్రాసు

## 59

మాట ప్రకారము ఆమె రాకపోయినా
నిద్రైనా వస్తే బాగుండును
అప్పుడైనా,
మృదు పద విన్యాసముతో రాజహంసను పోలు
ఆమెను కలలో చూస్తాను
అని వగయును స్వప్నకాంక్షి
నిద్రా వంచితుడగు ప్రేమ పీడితుడు.

11-8-85
గూడూరు స్టేషన్

## 60

నిద్ర శాంతిని మరచింది
స్వప్నసుందరుల వెంటబడింది.
షాజహాన్ ముంతాజ్‌ను విస్మరించాడు
తాజ్‌మహల్‌ను స్మరించుచు మరణించాడు.

## 61

నిద్ర వినుబాటలలో
కేకలిడే గరుడపక్షి స్వప్నము.

## 62

నిద్ర మానస సరస్సులో
సువర్ణ కమల మృణాలముల మెసవుచు
ఈదులాడే రాజహంస స్వప్నము.

63

నిద్ర ఆశ్రమకుంజములో స్వప్నము
కూజితముల ఆలపించు కోకిల
వసంతముననే గాక అన్ని ఋతువులలో ఆలపించును
పంచమ స్వరముననే గాక అన్ని స్వరములలో ఆలపించును.

7-10-85

64

నిద్రకు తెలియని అక్షరాలతో
జిలుగు వ్రాతతో వార్తల తెచ్చు కపోతము కల
ప్రత్యుత్తరము లేకనే మరలి పోతుంది.

65

నిద్ర ప్రవాస ప్రేయసికి
కోడ్‌లో పంపే వలపుకమ్మ కల.

66

ఆదులు, పునాదులు తెలుపనివే కలలు
ఎందుకు పుట్టునో అజ్ఞాతముగనే యున్నది
మెదడులోయున్న కామెరా తీసే చిత్తరువులు కలలు.

67

తెల్ల మబ్బులు లేని ఆకాశము
దుఃఖాలు లేని జీవితము
కలలులేని నిదుర లేవేమో.

## 68

కలలలో రంగులు లేవని అంటారు
నమ్మ పిలుకొని సత్యముగా తోస్తుంది
ఎవరికి వారు, కలల పరీక్ష చేసికొనవచ్చును
రంగులు కలవో, లేవో.

## 69

నిదుర కలలకు లేని శక్తి
పగటి కలలకు కలదు
కొన్ని అపూర్వమైన సాహసాలకు
అనుకోని విజయాలకు పునాదులు వేస్తాయి.

## 70

ఏనుగును సింహము వలె
తరుముకొంటుంది నిదురను కల,
కల అలసిపోతుంది
నిద్ర నిబ్బరంగానే సాగిపోతుంది.

## 71

నిద్ర మబ్బు చాంధినీలో
పురివిప్పి కదను తొక్కు నెమలి కల.

## 72

నిదుర గుండె పళ్ళెరములో
వెలుగుచున్న కర్పూర హారతి కల.

## 73

నిదురలో కలలు కంటాము
దీర్ఘ నిద్రలో కూడ కలలున్నాయా ?
చావులో బ్రతుకే కల
అంటారు వేదాంతులు, మాయావాదులు
కల తుది కాగా, బ్రతుకు చావులో నిదురిస్తుంది.

## 74

నిద్రా వటవృక్షము
తెలియగ రాని సీమలకు ప్రాకుచు
జారవిడిచిన ఊడలా
గుర్తుతెలిపే జాడలా, స్వప్నాలు.

# నేడు

1

మరణించిన భూతకాలపు అంధకారము
జన్మించని భావికాలపు అంధకారము
మధ్య మెరిసే జ్యోతిరింగణము నేడు.

2

చీకటి కొండల రెంటి నడుమ
జాలువారు సన్నని వెలుగువాగు నేడు.

3

పెద్దదైన చీకటి తెరలో
వెలుగును చిందే చిన్న బెజ్జము నేడు.

4

అమావాస్యా నిశి తిమిరాధరముల
కన్పించే చిరునవ్వు నేడు.

5

నిత్య నిశీథిని తాల్చిన తిమిర మకుటములో
మెరిసే ఏకైక రత్నము నేడు.

6

అనంత కాలపు నీల సింధువులో
స్వర్గమునుండి రాలిన అమృత బిందువు నేడు.

7

విశాల నీలాకాశములో
రెక్కల విప్పి తిరిగే అప్సర నేడు.

8

యమునానదీ కృష్ణ నీరములలో
జలకములాడు రాధ నేడు.

9

కుంతల తిమిర నికుంజములో
హసించే ఏకైక మల్లికా ప్రసూనము నేడు.

10

తిమిరార్ణవ శిరోభాగమున
ఉదయించిన నెలవంక నేడు.

## 11

తమాల కాననములో
కులాయమును కట్టుకున్న
శ్వేత విహంగము నేడు.

## 12

గగన వ్యాపిత ఘనాఘనముల
ముసుగును ఎత్తి చూచే
మెరుపు పడతి నేడు.

## 13

గడచిన కాలపు కోట్ల నిన్నలను
రాబోవు కాలపు కోట్ల రేపులను
తగిలించే వెండికొలికి నేడు.

## 14

అంధకార మహార్ణవములో
రేగే బడబానల స్ఫులింగము నేడు.

## 15

తిమిర రాత్రి
వెలిగే ఒకే ఒక
తారాప్రదీపము నేడు.

## 16

వెడలిపోతూ పోతూ
నిన్నలు కార్చిన
కన్నీటిబొట్ల వరుస నేడు.

## 17

నిన్నలు
రేపులకు
అందిచ్చే
లేఖ నేడు.

## 18

పుట్టబొయ్యే రేపులను శిశువులకై
నిన్నలను మాతలు
చేయించిన
వెండి ఉయ్యేల నేడు.

## 19

భూతకాలము
చేసి వెడలిన
వెండి అక్షరాల
ఆటోగ్రాఫ్ నేడు.

## 20

భూతకాల శిథిలాలలో
దొరికిన వజ్రము నేడు.

**21**

భూతకాలపు చీకట్లను
భవిష్యత్తు కాలపు చీకట్లను
వేరుచేసే కరవాలము నేడు.

**22**

భూతకాలం
భవిష్యత్తుకు
స్వాగతమిస్తూ
పట్టే కర్పూరహారతి శిఖ నేడు.

**23**

అనంతకాలపు
కృష్ణలలాట ఫలకమున
తీర్చిదిద్దే
చందన నామము నేడు.

**24**

వెడలిపోతూ అదృశ్యమయ్యే
అమావాస్య రథముపై
టెక్కెమువలె వెలయు
బాలచంద్రుని కళ నేడు.

**25**

నీలోత్పల పూర్ణ కాసారమున
పూచిన కుముదము నేడు.

**26**

కోటి కాళ రాక్షసుల మధ్య
హనుమంతునికి కాన్పించే సీత నేడు.

**27**

ప్రళయకాల సంహారమునకై
వెడలు విరాట్ స్వరూపుడు
యమధర్మరాజుని
యజ్ఞోపవీతము నేడు.

**28**

దిగంత పర్వతాల
శిఖరముల నుండి
క్రిందికి పడే
జలపాతము నేడు.

**29**

చీకటి ఏరులో
తేలుచు పోతూ
చిరునవ్వే బుడగ నేడు.

**30**

వ్రజ వధువుల
జలక్రీడలచే
పులకితగాత్ర యమున
వెలువరించు హాసఫేనము నేడు.

31

పాపక్షాళనము కాగా
పాతాళము నుండి
పైకి వచ్చే ధర్మమూర్తి నేడు.

32

భవిష్యత్తు కాల వల్మీకము నుండి
భూతకాల వల్మీకములోకి పొయ్యే
కుబుసము విడచిన శ్వేతనాగము నేడు.

(23-7-77, మద్రాసు)

# వీచికలు

**1**

శ్రావణ సంధ్యా కాసారములో
మునగవచ్చిన గజముల పాలుడను
మెరుపుల కొరడాను విసరుచున్నాను
ఉరుము అరపులతో అదిరించుచున్నాను
గోపాలుడ మాత్రమే కాదు గజపాలుడ కూడా.

**2**

క్షామసీమల వ్యథ తీర్చుటకై వచ్చి
మబ్బు రాత్రంతా సముద్రము మీద
కురిసి వెళ్ళింది
తప్పు విలాసమునకు చేరిన ప్రేమలేఖ

**3**

వర్ణముల రాల్చుకొని నగ్నంగా
నిలుచున్న చెట్టు మోడు
మరణ వసంతమున
మలయ మారుతాల గిలిగింతలచే
మందస్మితముల చేయుచు
కాళ్ళుచాపి పరుండిపోవుటకు వేచియున్నది.

**4**

క్షామ దినాలలో పెరిగేవి
అన్నిటి ధరలు
మధ్యతరగతి అప్పులు
దాతల కీర్తి లతలు.

## 5

84 ఆగష్టు సెప్టెంబరులలో
వచ్చిన రాజకీయ పరిణామాలు
వడిగా వెళ్ళే వాహనాలకు
ఏర్పడిన స్పీడు బ్రేకరులు
వ్యక్తులకు పార్టీలకు అవసరాలు
అందరికీ క్షేమాలు.

## 6

పండితులకు పండితులు పుట్టరు
నాయకులకు నాయకులు పుట్టరు
సన్యాసులకు సన్యాసులు పుట్టరు.
నేరస్థులకు నేరస్థులు పుట్టరు.

## 7

నా ఆశలు సూక్ష్మములు
మినుకుమనే తారాదీపికలు
నా నిరాశలు దీర్ఘములు
సంధ్యా సూర్య ఛాయలు
దుఃఖ తిమిరాలను ఆహ్వానించేవి.

## 8

విద్యుత్ కాంతులలో
పురాణ పఠన
శ్మశానాగ్ని వెలుగులలో
కవితల వ్రాయుట
మరణాసన్న తరుణములో
స్మృత సుమముల విరియించుట
ఎవరో మహాత్ములకే సాధ్యము.

## 9

చెవిటివారికి
దూరముగ వినబడే మాటలు
శబ్దాలుగ, శబ్దాలు మాటలుగ వినబడునేమో
జరిగే సంభాషణలు
సగము సత్యాలు
సగము ఊహలు.

## 10

కవిత్వము అధ్యయనము చేయుటకే
కేవలము అనుభవించుటకు కాదు.

## 11

కవిత్వములో ఆనందమును
పిండవలెనని చూస్తాము
కవిత్వము మన శక్తిని
పరీక్షింప చూస్తుంది.

## 12

కవి ఎవరికొరకు వ్రాస్తాడు?
తన ఆనందమునకా
తన సమకాలీనులకా
భావితరముల వారికా
ఆధునికులకా
శాస్త్ర పూజారులకా.

## 13

కవి పనిచేసేది
తన ఏకాంత కనకమహల్ లోనే
నివసించేది
పట్టణ సందులలోనే
జనముల మధ్యనే.

## 14

కవితా సుందరి
సహృదయ పాఠకలోకానికి
చేరుటకు అభిసారమున వెడలుచున్నది.
మహాకవుల కవితాసుందరి
విశ్వాభిసారమున వెడలుచున్నది.

## 15

సాహితీ తరువుకు
పుట్టేది కవితా ఫలము
మాగి భక్ష్యయోగ్యమగుటకు
కొంతకాలము పట్టును.

## 16

గోధూళి వేళ
నల్లమబ్బులు కొంగల పొదిగాయి
కొంగలు మబ్బుల గోడలనుండి బయటపడి
బారులుగా చేరి పరుగిడినాయి.

17

మరణ వాక్యములో
జీవితము ఆశ్చర్యార్థక సంకేతము
జీవిత వాక్యములో
మృత్యువు పూర్ణ విరామ సంకేతము

18

మాడ్చే సూర్యకిరణమే
ఇంద్రధనుస్సును పుట్టించేది
పోషించే జలబిందువే
వరదయై ముంచేది.

19

చంద్రోదయమునకు
సమయము స్థిమితము
స్థళము స్థిమితముకాదు శుక్లపక్షములో
సమయము స్థిమితము కాదు
స్థళము స్థిమితము బహుళ పక్షములో.

20

జ్ఞానసాగరము విశాల అనంతము
తెలిసినది దోసిటనీళ్ళ ప్రాయము
తెలియనిది తెలిసికొనుటకు ఎంత యత్నించినా
ఎక్కడో మూల అంచులో
మునిగినట్లే ఉంటుంది
అలల మీద అలలుగా
జ్ఞానసంపద జలాలు మిగిలినట్లే ఉంటుంది.

## 21

సూర్యోదయ అరుణ రక్తిమా వైభవాన్ని
నిశీథ నేత్రాలు తిలకించలేవు
రాత్రి చీకట్ల పక్షైరములో
వెలుగుచున్న కాంతి బిందువులను
మ్లానమొనర్పలేదు సూర్యకిరణము.

## 22

యౌవనము వృద్ధాప్యాన్ని అపహసించింది
నడుము వంగిన బోసినోటి అవ్వా అన్నది
ముసలితనము చిరునవ్వుతో
నీ నీడలలో నున్న నీదాన్నే నేను
నీ ఆసన్న భవితవ్యాన్ని
నీ గబగబలు నీ పకపకలు
చాలించుకో, స్థిమితము పొందు
అని శాంతముగా అన్నది.

## 23

రక్షకులే హంతకులైనటుల
మెరపులే పిడుగులైనటుల
జందెమే ఉరిత్రాడైనటుల
ప్రాతః విహారమే ద్రోహ సంహారమాయెను
మధువుల కూజా
రుధిరభాండ మాయెను.

## 24

ఝుంఝూ రౌద్రములో
నగరము బీభత్సమాయెను
దౌర్జన్యమునకు నిస్సహాయత బలియాయెను
మానభంగమైన యువతి
తను మనముల వలె.

## 25

మరణ నీలి నీరాలలో
ఆడుచున్నాము జీవన హోళీ ఆటలను.

## 26

వేదాంతము గంధర్వుల
కంఠాన్నైనా అదిమివేస్తుంది
సౌందర్య విలాసాలనైనా తుడిచి వేస్తుంది.
కవిత్వము
శిల్పాలను కళలను
పెంపొందించేది
ప్రేమ ప్రసూనాలను
వికసింప చేసేది
రాళ్లను అందాల బొమ్మలుగా మలిచేది
మాటలను రాగములో పొదిగేది.

## 27

నిచ్చెన ఎక్కినానని సంతసించాను
క్రింద మన్ను బోలని ఎరుకలేదు
మన్ను క్రుంగింది నిచ్చెన కూలింది
హాసధారలు ఎగచిమ్ముచుండిన నేను
రుధిర ధారలు కార్చుచున్నాను.

## 28

పునాదులు చాలని భవనములో కూర్చున్నాను
భవనాన్ని స్వప్న శిఖరాలతో నింపాను
వడిగాలుల తాకుడుకు భవనం కూలింది
స్వప్న శిఖరాలు రెక్కలతో ఎగిరిపోయాయి.

## 29

ఆనందాలు రెట్టింపులయ్యేది
దుఃఖాలు తరిగి సగము లయ్యేది
ఎప్పుడు? జీవితపు పగటిపూటా
జీవితాంతపు రాత్రిపూటా.

## 30

తుఫాను గాలులు కొండల కదల్పలేవు
చెట్ల కొమ్మలను ఊపేస్తాయి
ఆందోళన ఊరేగింపులు
ప్రభుత్వాలను కూల్చలేవు
చిన్న దుకాణాదార్లను ఇబ్బంది పెట్టుచుంటాయి.

## 31

మేకను అనురాగముతో పెంచేదొకడు
నిర్దయగ చంపేదొకడు
ఏ భావము లేక ఆనందముగ తినే దింకొకడు.

## 32

అతనికి
కూడా పుట్టి పెరిగిన
అన్నదమ్ములు దూరమైనారు
క్రొత్తగ వచ్చిన
బావమరదులు దగ్గరైనారు
కొమ్మలు దూరమైనాయి
ఊడలు దగ్గరైనాయి.

## 33

సుందరీ ముఖ అలకలు
ఎంత కుటిలమైతే అంత అందము
రాజకీయ పదవీ కాంక్షల పన్నాగాల వలె.

## 34

పుణ్యము చేసి మంత్రులగుతారు
పాపము చేసి మంత్రుల వద్దకు వెళుతారు.

## 35

ఆయన వృద్ధాప్యముతో
వసంతాలు ఆడుచున్నాడు
శతాబ్ది ప్రయాణానికి
చేత కట్టె ఊనాడు
దానధర్మాలతో దారిబత్తెము చేకూర్చుకొన్నాడు.

## 36

ఆమె సాహిత్య విమర్శ చేస్తుంటే
సెన్సార్ బోర్డులో ఉన్నట్లే తోచింది
ఆమె వ్రాతలు ఆయన చదువలేదు
బాగు అని పొగడలేదు
ఆమె మాత్రము ఎందుకు మెచ్చాలె అతని వ్రాతలు.

## 37

ఆమె అనామిక ఎందుకు అగుతుంది
యం. ఎల్. ఏ. కుమార్తె అత్తగారని చెప్పండి
వజ్రపుటుంగరము వహించే వ్రేలని చెప్పండి.

## 38

భోజనము తృప్తిగా చేసి
వంట ఎంత బాగుంటే అంత
ఆయుస్సు తగ్గుతుందని అన్నాను
వక్రోక్తికి మంచి ఉదాహరణ
అని అందరు సంతసించారు.

## 39

ఏమండీ, ఇక్కడొచ్చి కూర్చున్నారు ?
ఇది లేడీస్ కంపార్టుమెంటు
ఫర్వాలేదు, నావల్ల మీకు ప్రమాదము లేదు
పెద్ద ఉద్యోగములో ఉండి,
పోయిన యేడే రిటైరయినాను
రిటైరయినారు, సరే
కోరికల వదలి సన్యాసి కాలేదుగదా!
పెద్దల చేష్టలు వింతగా యున్న
దృష్టాంతాలు చాలా విన్నామండి.

## 40

పెద్ద యింజనీరుగా ఉండి రిటైరయినారే
ఏదైనా మంచి పరిశ్రమ పెట్టకూడదూ!
నేను ఎవరికోసము పెట్టాలె ?
ఫ్యాక్టరీకి పోతే, శ్రామికుల రక్తము
పీల్చేవారు పెట్టుబడిదారులు
జలగలు అని తిట్లు తినాలె,
ప్రభుత్వాని దగ్గరకు వెళ్లితే,
చీకటి వ్యాపారస్థులు, పన్నులు ఎగేసేవారు
సంఘద్రోహులు, లాభాలమీదే దృష్టి
అని తిట్లు తినాలె, ఎందుకు ఈ గొడవంతా

## 41

సెక్రటరీ : మంత్రిగారు, మీరు
ప్రభుత్వాన్ని నడపవలసిన వారు
పెద్ద పాలిసీలను నిర్ణయించి
మాచేత పనిచేయించ వలసినవారు
ప్రజాక్షేమముకై పాటుపడవలసిన వారు
ఈ చిన్న ఉద్యోగాలు, బదిలీలలో
మీరెందుకు జోక్యము కలిగించుకొంటారు ?
మంత్రి : మీకు పరిపాలనానుభవము
చాలా ఉన్నది, మీరే ఆ పాలిసీలను నిర్ణయించి
ఆ ఉద్యోగాల బదిలీలు మాకు వదిలివెయ్యండి
మేము ఓట్లమీద జీవించేవారము,
ప్రజా సేవకులము, వారు కోరింది
మేము చేయకుంటే, ఓట్లు ఎట్లా వస్తాయి ?
సెక్రటరీ : (పెద్దగా నవ్వి)

మా పని మీరు, మీ పని మేము చేస్తుంటే
పరిపాలన సాగినట్లే!
ప్రజాస్వామికము ఏమైపోతుంది ?
మంత్రి : ప్రజాస్వామికము సంగతి
తర్వాత చూస్తాము.
ముందు మేము గెలవాలె గదా !

## 42

భాషలు మతాలు
నీ కొరకై ఉన్నవి
భాషలకై, మతాలకై
నీవు లే.

## 43

కోరికలు నిదురించే పాన్పు కాదు
మానవ హృదయము
పురివిప్పి ఆడే విహారభూమి.

## 44

కోరికలే పైకి ఎగిరించేవి
పువ్వుల పూయించేవి
కోరిక పువ్వులు లేకపోతే
మరుభూమి సమానము.

## 45

ఆరిపోయిన చితాగ్నుల బూడిదనుండి
కోరిక కన్నులు మెరుస్తున్నవి
సెగలతో పిలుస్తున్నవి
చచ్చినా, చావనివే కీర్తి కోర్కెలు

## 46

కోరికలే ఆవిరి
హృదయ యంత్రాన్ని నడిపించేవి,
కోరికలేని హృదయము
వెలుగులేని దీపము
నాలుకలేని నోరు.

## 47

కోరిక చిగిర్చనీయక
హృదయములో శిశిరాన్ని పెంచుకుంటే
కోరికే కలయై
వెంటాడుతుంది.

## 48

ప్రేయసి వ్యథిత హృదయము
విమర్శిస్తున్నది
దోషముల పట్టుచున్నది
చీకాకును చూపుచున్నది
దూషించుచున్నది
దానికడ ఏ మాటలు చెప్పగలము
మాటలే కూర్చలేని స్థితి అది.

49

చీకట్లను శాసించుచుండిన
దీపము ఆరిపోయింది
చీకట్లలో చిక్కువడిన దీపము
తిరిగి వెలగాలని కోరింది
ఎంత యత్నించినా, వెలగలేక పోయింది
ప్రాణదీపాన్ని ఆర్పేసుకొన్న మనిషి
తిరిగి వెలిగించుకో లేడు.

50

గాలికి ఆర్పే శక్తి గలదు
వెలిగించే శక్తి లేదు
అభిమన్యుడు పద్మవ్యూహములోకి
చొచ్చుక పోయాడు
బయటికి వచ్చే విద్యను నేర్చుకోలేదు.

51

వేడి నీళ్ళల్లో చన్నీరు కలుపవచ్చును
చన్నీటిలో వేడినీళ్లు కలుపవచ్చును
కలిపిన పిదప విడదీసే మంత్రము
విజ్ఞానానికి తెలియదు.

**52**

గుర్రానికి ముందుకు పరుగెత్తే శక్తి ఉన్నది
వెనుకకు పరుగెత్తలేదు
మనిషి అంతే
కాలు చేయి ఒకవైపునే మడత పడుతుంది
ఎదుటివైపు మడత పడలేదు
మడత పడిందంటే,
విరిగిపోయిందన్నమాటే.

**53**

పాము కుబుసాన్ని వదలగలదు
వదలినదానిని తొడగలేదు
వాంతిని క్రక్కవచ్చును
క్రక్కిన దానిని మ్రింగలేము.

**54**

నేను కవితా పరీక్షకు
ఆలస్యంగా వచ్చాను.
వ్రాయవలసినది చాలా ఉన్నది
సమయము తక్కువగా ఉన్నది.
అందుకే గబగబ వ్రాసివేస్తున్నాను.

**55**

మంత్రివర్గాన్ని విస్తరింపవచ్చు
తగ్గించినప్పుడే పార్టీలో
చిక్కులు ఏర్పడేది.

## 56

ప్రజల యోగక్షేమాల పథకాలు
వేయడము తేలికే
ఖర్చులోటును పూడ్చుటకు
పన్నులు విధించినప్పుడే చిక్కు.

## 57

ముఖ్యమంత్రి క్రొత్త మంత్రుల పేర్లను
ప్రకటించాడు
అసంతృప్తి వాదాల తలలు చాలా
లేచాయి పార్టీలో
మంత్రివర్గ విస్తరణ త్వరలోనే
అని ప్రకటించాడు
లేచిన తలలు దింపుడు పడ్డాయి
ఆశలతో మెడలు సాగాయి.

## 58

కృష్ణా జలాల తగాదాలో
జోక్యము కలిగించుకోండి
అని అడిగారు కాంగ్రెసు ప్రధానిని
ఒకటి జనతా ప్రభుత్వము
ఇంకొకటి తెలుగు దేశం
మూడవది అన్నా డి. యం. కె.
నే నేమి చేయాలె అన్నాడు
రాజీవ గాంధి, భుజాలు కదిలిస్తూ.

## 59

కౌన్సిల్, తాలూకాలు, అకాడమీలు
సిండికేట్లు రద్దుచేసి
గవర్నర్లమీద పడ్డాడు
ఉద్దుల రుచిమరిగిన రామారావు
జిల్లాలను, క్యాబినెట్‌ను
ఎప్పుడు రద్దుచేస్తాడో !
జిల్లాలను, సుబాలక్రింద మార్చి
క్యాబినెట్‌కు మారుగ
ఇంకొక ఛోటా మంత్రితో
పాలన చెయ్యొచ్చు.

## 60

తగాదా వస్తే
తిట్టుకోవచ్చు
కొట్టుకోవచ్చు
కోర్టుకు లాగొచ్చు
చంపేదేమిటి బలహీనులను
అంతమందిని.

## 61

నా ముంగిట నల్లమట్టిలో
ఎన్ని రంగుపువ్వుల కాంచుచున్నాను!
ఋతు రమణుల హర్ష రోమాంచితాలా
ధరణీ ఆనంద కేతువులు.
మట్టిక్రింద, ఇంకా దాగియున్నవో
ఎన్నిరంగులో, ఎన్ని సువాసనలో
శుభతరుణమునకై నిరీక్షించుచున్నవి.

## 62

హిందీకి సుమిత్రానందన పంతుకు
ఉర్దూకు ఫిరాక్ గోరఖ్‌పూరికు
తెలుగుకు కవిసమ్రాట్ విశ్వనాథకు
జ్ఞానపీఠ బహుమతి లభించింది
ప్రవరసమితికి నేను అధ్యక్షునిగా ఉన్నప్పుడే
అది నా అదృష్టమని భావించాను
వారివారి ప్రతిభా వైభవముల చేత
సంపాదించుకొన్నారు.

## 63

ప్రత్యేకాంధ్ర ఉద్యమములో
ఆస్థానకవి పదవికి ఎందుకు రాజీనామా
ఇచ్చారని అడిగాను విశ్వనాథను
ఈ కొంప కాపాడుకోవడానికి అంటు
చేతులెత్తి చూపారు.
వచ్చిన విద్యార్థులే పంపారు రాజీనామాను
తంతి మూలకముగ అన్నారు.
జరిగిన విషయము తెలుపుచు
ప్రభుత్వానికి ఉత్తరము వ్రాశాను
విశ్వనాథ చేవ్రాలు ఎచ్చటలేదని
పదవి వారికి మరలా ఇచ్చారు.

## 64

జ్ఞానపీఠ బహుమతుల పిదప
లక్షరూపాయలు ఏమిచేశారు
అని అడిగినాను వారి ఇంటివద్ద.
నాకు అప్పులిచ్చి రాదనుకొన్న
వారంతా వచ్చారు, వారికి పాతికవేల

వరకు ఇచ్చాను.
మా ఊరి దేవాలయ ఉద్ధరణకుగా
పాతిక వేలకు పైగా ఇచ్చాను
మిగతాది ఉంచుకొన్నాను
అన్నారు విశ్వనాథవారు.

## 65

ఫిరాక్ గోరఖ్‌పూరిని అడిగాను
లక్ష ఏమిచేశారని
త్రాగి ఖర్చుపెట్టానని అందరు అన్నారు
నేను వెర్రివాడినిగా కనబడవచ్చు
కాని వెర్రివాడను కాను
భద్రంగా బ్యాంకులో దాచాను అన్నాడు.
సంతోషించాను.

## 66

అనుమతి పొందకనే వచ్చేవి జన్మదినాలు
ఇంకొక సంవత్సరము బ్రతికామని సంతోషము
అందులకే అభిమానుల ఆశీస్సులు
ముందు ఎట్లావున్నా జరిగిందానికే సంతోషము.

## 67

జీవితము బహు వర్ణములతో
వివిధ సౌరభములతో
పూచి వాడే ప్రసూనము
మరణము కదలికలేని తోట.

68

ఉపన్యాసము ప్రాచీనులకు తెలియని
ప్రక్రియ కాబోలు
హరికథ, పురాణపఠన, గీతాప్రవచనాలు
తర్కచర్చలు, మీమాంసల గోష్ఠులు ఉన్నాయి.
నేటి ఉపన్యాసరీతి లేదేమో!

69

కొన్ని ఉపన్యాసాలు
బడిలో పాఠము చెప్పినట్లు
పురాణ పఠన చేసినట్లు
హరికథ చెప్పుచున్నట్లు ఉంటాయి
ప్రాచీన శ్లోకాలు వల్లించుచు
తాత్పర్యాలు వివరించుచు
సొంత అభిప్రాయాలు లేక
చిలుక పలుకులు చెప్పుచుంటే
ఉపన్యాసముగా ఉండదు.
ఇతరుల ధ్వనులకు
ప్రతిధ్వని అగుతుంది.
కవి సమ్మేళనములో కవిత్వముకన్న
వ్యాఖ్యానము ఎక్కువగా ఉంటుంది.

70

వన సౌరభముల
పవన కుమారులు కొనిపోవ
వనము శూన్యముగా యున్నది
తోటమాలి వెడలిపోవ
తోట దిగులు చెందియున్నది.

## 71

వకుళమాల వాడిపోయినది
వాసన మాత్రము వీడకున్నది
కస్తూరీమృగము గంతులేసి వెడలిపోయింది
విలాసమును తెలుపుచు, పరిమళము
హృదయమును తాకుచు మిగిలిపోయింది.

## 72

మెదడు లోతులలో పుట్టిన
కళా భావములు
కవికి పదములలో కవనమగుతుంది
గాయకునికి స్వరములలో కీర్తన యగుతుంది
వైణికునికి వ్రేళ్ల మీటులలో వాద్యమగుతుంది
చిత్రకారునికి కుంచెద్వారా బొమ్మయగుతుంది
నర్తకి అంగభంగిమముల ద్వారా నృత్యమగుతుంది.
శిల్పికి ఉలినొక్కులలో విగ్రహమగుతుంది
భావము వివిధ వేషాల వేస్తుంది
పలుభాషలలో పలుకరిస్తుంది.

## 73

నేను రాజకీయములోనికి చాలా ముందే వచ్చాను.
18 వ యేట అసహాయోద్యమములో బడిని వదిలాను
22 వ యేట ఉప్పు సత్యాగ్రహములో జైలుకు వెళ్ళాను.
29 వ యేట మద్రాసు మంత్రినయ్యాను.
39 వ యేట మద్రాసు ఆర్థికమంత్రి
40 వ యేట లీడర్ ఆఫ్ ది హౌస్
మంత్రులలో చిన్నవయస్సు

43 వ యేట ఆంధ్ర యూనివర్సిటీ, ప్రో-చాన్సలర్
59 వ యేట ఉత్తరప్రదేశ్ గవర్నరు
కవితా రంగములోనికి చాలా ఆలస్యముగనే
వచ్చాను.
69 వ యేట సొంతకవితల ప్రారంభము
78 వ యేట 12 వ పుస్తక ప్రచురణ
ఒకచోట ముందు, ఇంకొకచోట ఆలస్యముగ రంగప్రవేశము
నా జీవితములోని శుక్ల బహుళ పక్షాలు.

## 74

జీవన దీపానికి
దుఃఖాలు చమురు
సుఖాలు వత్తి
ఏది లేకున్నా, దీపము వెలుగదు.

## 75

దుఃఖాలు వద్దని కోరుకోవడము
చావును రమ్మని పిలిచినట్లే
చావులోనే దుఃఖాలు లేకుండేది.

## 76

దుఃఖాలు అనేకస్థాయిలలో ఉన్నాయి
క్రుంగి చితికిపోవడము నుంచి
మనస్సుకు అప్రియముగ తోచేవరకు
వేర్వేరు తీవ్రతలతో ఉన్నాయి.

## 77

కర్పూర వసంతరాయలు
ప్రేమ ప్రపంచములో పెద్దప్రభువు
కర్పూరపు వెలుగు వాసన
వసంతపు శోభావిలాసము
జీవితములో పూర్తిగ అలముకొన్నాడు
భార్యను ఏడిపించాడు
దాసికై ఏడ్చినాడు.

## 78

రేయి మిగిలి యున్నది
కవ్వించుచున్నది
చంద్రుడు అస్తమింప
చీకట్లు పరిచియున్నవి.
చుక్కల మినుకులు
కోరికల ఎగురుజాడల చూపుచున్నవి.

## 79

శారద స్నేహముగనే ఉన్నది
ఆప్యాయ ఆతిథ్యాలతోనే ఉన్నది.
వసంత దక్షిణ సమీరాలలో వచ్చింది
పుష్పాలతో నవ్వింది, పరిమళాలతో క్రమ్మింది
శారద తాళలేని ఈర్ష్యతో తొలగిపోయింది
శారద, వసంత ఏకకాలమున ఇమడరు.
రుతుధర్మమే కాదు
జీవితధర్మము అంతే.

## 80

గగన రాజ్యములో
సూర్యచంద్రులు ఈర్ష్యాళువులే
పరస్పర అసహిష్ణువులే
గ్రహాలు, తారలు రాశిలోనే ఉన్నాయి
మందిలోనే గొబ్బిళ్ళు ఆడుతాయి.

## 81

ఏనుగులు జింకలు
గుంపులోనే సంచరించేవి
సింహాలు పులులు
గుంపులో అతకలేవు
సమానులు శత్రువులు.

## 82

సంఖ్య సహకారాన్ని పెంపొందించేది
సంఖ్య అంతఃకలహాలను పెంచేది
పెద్దలకు కావలసింది అనుచరులు
సహకారులు కాదు.

## 83

ముఖ్యమంత్రి
సమానులలో మొదటివాడు అని ఒక వాదన
సహాయకులకు ముఖ్యుడు అని మరొక వాదన
తేలని సమస్య రాజకీయ సిద్ధాంతాలలో.

## 84

మంత్రి మండలిలో
తీర్మానమునకు అనుకూలురు ఒకరు
ప్రతికూలురు పదిమంది
తీర్మానము నెగ్గింది
అని అన్నాడు ఒక బ్రిటిష్ ప్రధాని
తీవ్ర వ్యతిరేకవాదులు
రాజీనామా చేసి వెడలవచ్చును అని భావము.

## 85

ముఖ్యమంత్రి
మంత్రిమండలి నిర్మాత
అభిప్రాయ భేదాలు వస్తే
మంత్రిమండలి పోవాలె
ముఖ్యమంత్రికి చేటు లేదు.

## 86

ఎందుకయ్యా, అందని పదవీఫలాలకు ఆశిస్తావు
ఏదో రాయి విసరతాము, పండు రాలితే సంతోషమే
రాలకుంటే నష్టమేమీ లేదు
ప్రేమించి, విఫలమైనా సంతోషమే
ప్రేమించక మిన్నకుండుటకంటె అన్నారు గదా?

## 87

పదవులు నిప్పుల గుండాలు
ప్రలోభాల పట్టుత్రాళ్లు ఈడుస్తుంటాయి
నిప్పులో కాలి బొబ్బలు పోకుండ
త్రాళ్ళ ఉచ్చులలో చిక్కి గిజగిజ లాడకుండ
బయటపడి కుటీరము చేరాలె,
అనలతప్త కాంచనము వలె మెరవాలె.

## 88

పదవులు వరూథినీ పరిరంభణాలు
మోహపడక బయటికి దుమకాలె
ప్రవరాఖ్యుని చిత్తశుద్ధి ప్రదర్శించాలె.

## 89

"ఈ చీరెలో మీరు అందంగా ఉన్నారు
వేషభూషలు ఒద్దికగ అమరాయి"
"మీ ఆమోదానికి కృతజ్ఞతలు"
అన్నది ఆమె ఒక ఆధునికునితో.
ఆయనే ఇంకొకసారి ఇంకొక ఆమెతో
"ఈ వేషములో చక్కగ నున్నారు
తక్కువ వయస్సుగా కనబడుచున్నారు"

"మీ కిదేనా పని
వచ్చే పొయ్యే ఆడవాళ్ళను చూస్తూ
వాళ్ళ వేషాలను మెచ్చడము
మీకు వేరేమి పని లేదా"
అని కసురుకొని ముఖము చిట్లించింది.
ఒకామె ఆధునిక సభ్యత తెలిసినామెయని
రెండవయామె నాగరికత లేని పెడకట్టెయని
సమాశించుకొని వెడలిపొయ్యాడు.

## 90

వేణువు కావలసి వస్తే
వెదురుగడ వద్దకు వెళ్ళాలె
చెరుకుగడ వద్దకు వెళ్ళితే
లాభమేమి?

## 91

అతడు నా భుజాల నెక్కి—
అందరిచేత పనిచేయించు కోవాలంటాడు
సిఫారసులకు నన్ను తోడ్పడమంటాడు
ఇయ్యకుంటే నిష్ఠూరా లాడుతాడు
తెలిసినవారికి చెప్పడము కష్టమే
వ్రాయడము కష్టమే
తెలియనివారికి మరింత కష్టము
సొంతకాళ్లమీద నడవలేని యుగమిది.

## 92

బంధుజన చితానల శిఖనుండే
అక్షరోత్సవ ప్రదీపాల వెలిగించుకొన్నాడు
చితాభస్మ వేదికలే
పండిత గోష్ఠులకు స్ఫూర్తి నిచ్చాయి.

## 93

నా వద్ద సెలవు తీసికొనే
ఆమె వెడలి పోయింది
మంచి ఎండలోనే వెడలి పోయింది
నీడవలెనే నేను తోడు వెడలియుంటే
ఎంత ఆనందముగ ఉండేది
ఎంత అదృష్టముగ ఉండేది.

## 94

దినమంతా ఆమె తలపులు
నన్ను వెంటాడాయి
అవి గతకాల జ్ఞాపకాలు
నిద్రలో స్వప్నాలు
నన్ను ముసురుకొన్నాయి
అవి భావికాల ఆమంత్రణలు.

## 95

మానవుని జీవితము
కల కూజితాల విహంగము
కొమ్మపై కూర్చున్నది కొంతసేపు
పాడినది, ఎగిరిపోయినది-ఇక్బాల్.

## 96

సభకు ముందు, వేదికమీద ఉండిన శ్రీశ్రీ
సిగిరెట్టు ముట్టించాడు.
సభా మర్యాదకు వ్యతిరేకమని
కొందరు లేచిపోయారు
సిగిరెట్ కే కోపపడినారే
అసలుదే త్రాగియుంటే
ఏమి చేసేవారో అంటు నవ్వాడు శ్రీశ్రీ.

**97**

నిజాయితీగ పనిచేసి
లంచాలు పుచ్చుకోకుండుటే
విశిష్ట గుణమైనది నేటి కాలములో
ధనము ముట్టుకోడు, అబద్ధాలు చెప్పడు
అనేవే స్తుతి పాత్రములు, సన్మాన యోగ్యములైనవి
ఆమె వ్యభిచారిణి కాదు
అని ఉత్సవముకూడా చేస్తారేమో!
నైతిక విలువల కొలతలు మారుచునుంటాయి.

**98**

ప్రజా సేవలో
కనీసముగ కోరేది నిజాయితి, సద్ధర్మము,
నిజాయితి లోపించడాన్ని ఖండించాలె, శిక్షించాలె
నిజాయితీ లోపించలేదని ఊరేగించాలా?

**99**

కరవడు, పొడవడు, దొంగిలించడు
మోసము చేయడు, అని
స్తుతి పద్యాలతో, సన్మానపత్రాలు యిచ్చి
దుశ్శాలువ కప్పిన సమాజాన్ని ఏమనాలె!

## 100

కరువు కాలాలలో
మబ్బులు వర్ష వాగ్దానాలు చేస్తూ పోతాయి
మెరుపుల చూపిస్తాయి, ఉరుముల వినిపిస్తాయి
తుంపరల చల్లుతాయి, వాన మాత్రము సముద్రముమీదే.

## 101

స్నేహానికి ప్రాణమే యిస్తామని అంటారు
శుద్ధ చిత్తముతో అన్న వాక్చాతుర్య పదాలవి
ఇవ్వడానికి అధికారము
పుచ్చుకోడానికి అధికారము
లేనివారి ఆవేశ భావాలు
ఆడని నాటకములో లేని గిరీశములు.

## 102

పండితులకు కవులకు
టగ్ ఆఫ్ వార్ జరిగితే ఏమౌతుంది
పండితులు వయోవృద్ధులు
శాస్త్ర సూత్రములతో లాగుతారు
వెనుకచూపుతో నిలబడతారు
కవులు తరుణ వయస్కులు
భావ పక్షములతో ఎగురుతారు మిన్నులవైపు తిలకిస్తు
తొలి గెలుపు పండితులది
కడపటి గెలుపు కవులది.

## 103

ఆడవాళ్ళు అందముగా ఉన్నారా
మగవాళ్ళా అనే ప్రశ్న ఆదినుండి వస్తున్నదే
జడ్జీని తీర్పు అడిగారు
వేషభూషలతో కేశాలంకారములతో
ఆడవారే అందముగా ఉన్నారు
అలంకారాలు, ఆచ్ఛాదనలు లేకుండా
నిసర్గ సౌందర్యము మగవారిదే
అని తీర్పు యిచ్చాడు జడ్జి.
అందరు హర్షించారు, జయధ్వనులు చేస్తూ పోయారు.
అందుకే ఆడవారికి అలంకారాలు అవసరం.

## 104

మన కవిసమ్మేళనాలలో
పాఠకునికి ప్రోత్సాహాన్నిచ్చే
హర్షప్రకటనలు చేయరు
మౌనంగ, ఉదాసీనముగ కాన్పిస్తారు
ప్రశంసిస్తే ఆయుక్షీణమని కాబోలు మౌనం
లేక తమ ఆధిక్యత తగ్గుతుందనా?

## 105

తెలివిగల విద్యార్థికి
ఒక ఉపాధ్యాయుడు ఎన్నడు
మొదటిశ్రేణి మార్కులు యివ్వలేదు
విద్యార్థి పట్టుదలతో ఇంకా శ్రద్ధగా చదివేవాడు
బి. ఎ. కి ఇంకొక కాలేజికి వెళ్ళినాడు

ఉపాధ్యాయులు మెచ్చి ఎప్పుడూ
మొదటి మార్కులే ఇచ్చేవారు
తన మార్కులకు తనే భ్రమిసిపోయాడు
అధిక విశ్వాసముతో ఉపేక్ష చేశాడు
యూనివర్సిటి పరీక్షలో మూడవశ్రేణిలో నెగ్గాడు
ఇచ్చినవాడు పాడుచేశాడు
ఇవ్వనివాడు ప్రోత్సహించాడు.

## 106

మంచిని మెచ్చి చప్పట్లు కొట్టరు మనవాళ్ళు
నాటకాలలో తప్ప.
దోషాల వెదకి విమర్శిస్తారు
అభిమానము కన్న ఈర్ష్య మెండు
దుర్యోధనాంశ అధికము.

## 107

ప్రభుత్వ గజములకు
అంకుశములు కోర్టు ఉత్తరువులు
లేకున్న, ఏనుగులు
గిట్టని మనుషుల మీదికి దుమికేయి
గ్రామాలను నాశనము చేశేవి.

## 108

చెప్పే విషయములలో
మాకు ఆక్షేపణ లేదు
కాని, చెప్పేతీరు
పరుష పదాలు, నీచ ఉపమానాలు
ఒళ్లు మండిస్తాయి, రోతగ ఉంటుంది.

## 109

ఆమె మాటలు ఆసక్తిని పెంచుతాయి
ఆకలిని పుట్టిస్తాయి
ఇతరుల మాటలు కడుపు నింపుతాయి
ఎక్కువైతే వెగటగుతాయి.

## 110

యామినీ, నీ గుసగుసలు చాలించు
నీ లీలల విరమించు
పగలంతా పనిచేసి అలసి పొయ్యాము
ఇక నిద్రిస్తే మంచిది గదా
నీ నిశ్శబ్దపు శాలువా కప్పు.

## 111

భార్యకు మొగుడు కావడం మంచిదే
పార్టీలో మాకందరికి మొగుడు కావాలనుకొంటే
మే మెట్లా సహిస్తాము
అన్నది ఒక పార్టీ సభ్యురాలు.

## 112

రంకులాడి ధర్మ ప్రసంగాలు వింటుంటే
సర్కస్ బఫూన్ చేష్టలు చూస్తుంటే
నవ్వుతోపాటు అపహాస్యంగా ఉంటుంది.

## 113

భగవంతుడు, ప్రభుత్వాలను నిర్మిస్తాడు
సైతాను సెక్రెటేరియట్‌ను
అని గవర్నరుకు సి. ఆర్. రెడ్డి
ఫిర్యాదు చేశాడు, ఆలస్యాలను విమర్శిస్తు.

## 114

తరంగమా, నీకు అలసట లేదా
మాటి మాటికి తీరానికి తల మోదుకొంటున్నావే
నేను మాత్రము అలసిపోయాను
జీవితపు వెతలు క్రుంగదీశాయి
నేనిక జీవిత భారాన్ని లాగలేకున్నాను.

## 115

భూమి వసంతకాలములో
తన విలాసములను చూపుతుంది
ఆకాశము వర్షాకాలములో
తన వైభవాలను చూపుతుంది
రాజోత్సవములతో వస్తుంది వర్షరుతువు
అని కాళిదాసు నుతించాడు.
విస్మయాన్ని కొలిపేదే ఆ రుతువు.

## 116

గయోపాఖ్యానములో
కృష్ణునితోనే పోరుకు పూనాడు అర్జునుడు
కిరాతార్జునీయములో
శివునితోనే సమరము సలిపాడు అర్జునుడు
దైవాల ధిక్కరిచ్చే
గురువును మించిన శిష్యుడయ్యాడు.

## 117

దైవము చెప్పినటుల చేయ యత్నిస్తాడు మానవుడు
సైతాను కోరినవిధముగ చేస్తాడు మానవుడు.

## 118

రైలు కట్టను
వేయి గోళ్లతో బరికి గాయపరచింది రాత్రివాన
ప్రొద్దున్నే రైళ్ళ రాకపోకలు నిలిచిపోయాయి.

## 119

ఏమండి, ఏమైన రాస్తున్నారా ఇటీవల
రొట్టెకు వెన్నరాస్తున్నా, డబ్బుంటే
ప్రోనోట్లు రాస్తున్నా లేకుంటే
తీరికయుంటే కథలు రాస్తున్నా
లేకపోతే, ప్రేమ గేయాలు రాస్తున్నా
మా ఆవిడ మాత్రం, కంటికి కాటుక
నెత్తికి నూనె రాస్తుంటుంది, లేండి.

## 120

నేను చదివేది ఇంగ్లీషు
మాట్లాడేది ఇంగ్లీషు
వ్రాసేది ఇంగ్లీషు
కలలు తెలుగులోనే సుమా
అన్నాడు ఇంగ్లండులోఉన్న విద్వాంసుడు.

## 121

మిట్ట పల్లాలు ఎన్ని ఉన్నా
భూవలయము గుండ్రముగానే ఉంటుంది
ఆకాశము బోర్లించిన గిన్నెవలె ఉంటుంది
చూపుకు గుండ్రానికి ఏమి చుట్టరికమో!
విరాట్ స్వరూపిణి ప్రకృతి యొక్క
జారిపడ్డ వడ్డాణమా?

## 122

ఆమె విలాసముగ నడచి పోతుంటే
స్వర్గమే దూరమగుచున్నది
ఉండి, ప్రమోదముగ ఉండినది
వెడలి, ప్రమాదమైనది డెందమునకు.

123

ఆడవారికి సమాన గౌరవ ప్రపత్తులు
కొరబడినవని ఫిర్యాదులు
అత్తలైనవారు కోడళ్ళకు
ఎంత గౌరవ ప్రపత్తులు కలిగిస్తున్నారో
ఆత్మపరీక్ష చేసికొనుట మంచిది.

124

మానవ ప్రవృత్తుల దర్పణము కాదు కవి
అతడు సృష్టించే ఊహలకు
కల్పించే భ్రమల సంకేతములకు
మాత్రమే దర్పణము.

125

కవితలో వాస్తవికతకన్న
బుద్ధికన్న, కల్పన మెండుగా ఉండాలి
ఊహా తుషారములో కాన్పించే
సౌందర్యానందమే కవిత.

126

కవి కామెరామనిషి కాదు
చిత్రకారుడు కాదు
అగోచరమగు ఊహను
పదములలో అందముగ కూర్చువాడే.

## 127

వరద నీటి బొట్టులలోనే పుట్టుతుంది
ఊడలతో పరచుకొనే మఱ్ఱిచెట్టు
చిన్న గింజలోనే మొలక ఎత్తుతుంది
నగరాన్ని బీభత్స పరచే అగ్నిజ్వాలలు
నిప్పుపుల్లలోనే దాగి యున్నవి.

## 128

పక్షుల కలగానము
పుష్పముల పరిమళము
మిణుగురుల వెన్నెల
మూలతత్త్వములో ఒక్కటే
భిన్న అవతారాల ఎత్తింది
పలు యాసలలో పలుకరిస్తుంది.

## 129

మరణ హస్తములతో
జీవితము తోలుబొమ్మ
వ్రేళ్ల కదలికలతో ఆడిస్తుంది
కోరినప్పుడు క్షణములో
ఆట సమాప్తము చేస్తుంది.

## 130

1921 సం॥లో
13 యేళ్ల అభిమన్యుని మాదిరి వచ్చాను
జాతీయ కళాశాలకు.
1985 సం॥లో
రోగ భరిత తూణీరముతో
భీష్మాచార్యుల వలె వస్తున్నాను.

## 131

చిగుళ్లలో, పువ్వులలో
దర్శనమిస్తుంది వసంతము
తుంపరలలో, చినుకులలో
దర్శన మిస్తుంది కొండమబ్బు
నొప్పులలో, జబ్బులలో
దర్శన మిస్తుంది మృత్యువు.

## 132

అతను నడవడిలో, వేషములో
కాంగ్రెసు వాది,
మాటలలో కమ్యూనిష్టు,
హృదయములో జనసంఘి
విభిన్నత్వపు జలములలో
అతని జీవననౌక దొర్లుతు ఉన్నది.

## 133

గుండెలో గోడలు కట్టుకొన్నాడు
గోడల వెలుపల ఏమి ఉంచాలో
లోపల ఏమి దాచాలో
తేల్చకనే గోడలు కట్టాడు.

## 134

రాగతాళములలో నృత్యము వికసించింది
రేఖలలో రంగులలో చిత్రములు హసించాయి
పదముల మలుపులలో కవనము నాట్యమాడింది
బండల ఉలినొక్కులలో విగ్రహాలు అవతారమెత్తాయి
స్థూలములో కోమలత్వము ననలెత్తింది.

## 135

జీవితము, ఎంత రమ్యనందనము
అనుభూతులు ఎన్ని ఆకాంక్షాపరిమళాలు
దానికి ఇయ్యగలిగినదేమి?
మందస్మిత మరణ నీరాజనము తప్ప.

## 136

తరంగమా, ఈ తీరమున
నీకు విజయం ప్రాప్తికాలేదు
నూతన తీరముల అన్వేషించుకో.

## 137

వడిలేకున్న బొంగరము తిరుగదు
పడుటకు ముందు
ఎన్ని వయ్యారముల చూపుతుంది.

**138**

బ్రతుకు ఎడారుల్లో
సమస్యలు తోడేళ్ళవలె తరుముతాయి
పరుగెత్తి ఎక్కడికి పోతావు
ఎదురు తిరిగి తోడేళ్ళపై పడు.

**139**

తుఫానులో
తీరమున ఆశ్రయము నెమకుచు
పడవ సమీపించింది
తీరతరంగములు నెట్టివేయుచునే ఉండినవి
లంగరు వేయుటకును చోటు దొరకలేదు
పడవ మునిగింది లంగరుతో కూడ.

**140**

సంజె మసకలు
చుట్టు మూగిన మొయిళ్ళతో
కొబ్బరి అరటి ఆకులతో
మరింత దట్టములై నల్లబడినవి
పాపుల ప్రేతాలవలె.

**141**

దశాబ్దములో ఆ ఇంట ఎన్ని మార్పులు!
కొందరు చనిపోవ
కొందరు బ్రతుకుదెరువు వేటలో
పరసీమల అడవులకు వెడల
కొందరు పెండ్లాడి దూర గ్రామములలో
ఊడల వేసికొని స్థిరపడ

వర్ణాంతర వధువులు
అంటు మామిడులవలె నాటుకొన
తల్లి మాత్రము
దవడ ముడతలు, వయస్సు లెక్కలు మాన
వైధవ్య వృద్ధాప్య ఏకాంతముతో
మంచముమీద ముడుచుకొనేయున్నది.

## 142

బస్సు ప్రమాదములో
కొందరు చనిపోవ
తాను చిన్న ప్రాక్చరుతో బయటపడి
ఆసుపత్రిలో చికిత్స పొందాడు
సెలవులలో సంకల్పించిన
కార్య ప్రణాళిక
వ్యర్థమైనదని వగచాడు
అదృష్టానికి సంతసించుటకు మారుగా.

## 143

సరోవర జలముకుర లోకములో
పరిసరాల ప్రతిరూపుల గమనిస్తున్నాను
చెట్లు కదలుటలు పక్షులు ఎగురుటలు చూస్తున్నాను
నిర్మలముగానున్న నీరాలను
నీడలు కలత పెట్టుచున్నవి
నీళ్లకు నీడలనుండి విముక్తి లేదా?

## 144

బారులుగా వెడలుచున్న పిట్టల కేకలు
రేయి దట్టమగు చీకటి మడతల
చీల్చుకొని వచ్చుచున్నవి
చీకట్ల అంతఃపురాలకు
దర్వాజాల బిగించి, ప్రశాంతముగా ఉండే
అధికారము లేదా?

## 145

నగ్నంగా విహరించుచున్న చీకటిని
ఆందోళన పరచింది నా అగ్గిపుల్ల వెలుగు
అంతర రహస్యాలను వెలికి లాగింది
చీకటి ఏనుగులకు
కొరడా యైనది చిన్న వెలుగు.

9-10-84 రైలులో

## 146

అంబర విహారముచేసే విహంగాన్ని
వనములో బంధిస్తే ఎట్లా?
నా రెక్కలకు చాలదు తోట
ప్రపంచమే సంకుచితమైనట్లు ఉంటుంది.

## 147

మధుపాలకు ఏమి తెలుసు
వన సౌందర్యము, సౌరభము?
పుష్పము నుండి పుష్పమునకు
ఎగిరి సంతృప్తి పడేవి.

## 148

సాగర తరంగాన్ని
కాసారములో వదలిన ఏమౌతుంది
గమన శక్తిని పోగొట్టుకొని
నిర్జీవమౌతుంది.

## 149

ఖడ్గాన్ని కత్తిఒరలో దాచ యత్నిస్తే
ఒర చినిగిపోయి
నిరుపయోగమవుతుంది
వటవృక్షాన్ని తొట్టిలో
నాటినట్లగుతుంది.

## 150

మహాకావ్యములోని
మహాస్రగ్ధరను
భావకవిత్వములోని
తేటగీతిని కాను.

## 151

నేను విశ్వభారతివాడిని
ఏ తెలుగునాటికో
నెల్లూరుసీమకో
అంటించి ఇరికిస్తే ఎట్లా?

## 152

వనాన్నంతా హర్షభరితము
చేయగల సుగంధాన్ని
ఒక చెట్టుకో ఒక పువ్వుకో
పరిమితము చేయుట పాడియా.

## 153

సహస్ర సహస్రాబ్దాల
మానవోదయాన్ని చూస్తాను
ఒక వారము ఒక మాసము చాలదు
మనశ్శరీరాలు బిగుసుకపోతాయి.

## 154

పిడుగులలో తుఫానులలో
భాషించేవాడిని
చెవిలో గుసగుసలతో
పలుకరిస్తే ఎట్లా?

## 155

మిన్నుల బుగ్గల ముద్దిడే
శైల శృంగాలమీద నా విడిది
పిచ్చుకలతో పందాలాడుట
నాకు తగిన ఆట కానేరదు.

## 156

సముద్రతరంగాలలో దుమికి
అగాథాలను చేరి
మౌక్తికాలను తెచ్చేవానికి
ఒడ్డున కూర్చుని గుల్లల ఏరుట
పిరికివాని పనిగా ఉంటుంది.

## 157

ఆకాశాన్ని పులకిత మొనర్చే
ఇంద్రధనస్సును
ఉన్నతంగానే ఉంచాలె
అడవి జింకల వేటాడుటకు
ఉపయుక్తము కానేరదు.

## 158

వయస్సు హెచ్చేకొలది
కాలము విలువ హెచ్చుతుంది
శేషించిన కాలము తగ్గుచు వస్తుంది
కాని విలువైన కాలము
అనారోగ్యపు ఆందోళనలతో
నష్టమై పోతుంది.

## 159

ఎల్లలు కంచలులేని ఎడారిని
మూరలతో కొలుస్తామా?
రెండు రాత్రుల
ఒంటెల ప్రయాణమంటాము.

## 160

దూరాన్ని కాలంతో కొలుస్తాము
మద్రాసుకు నెల్లూరు
మూడు ఘంటల దూరమంటాము
ఖగోళములో అన్నీ
కాంతి సంవత్సరాల దూరమే.

2-7-84
నెల్లూరు.